Reg. No. 757

# అభినవసరస్వతి

[illegible] మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపబడుచున్నది.

గుంటూరు.

సంపుటము 14 } 1928 సం॥ జూలై, ఆగష్టు } 4. 5 సంచికలు

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0
పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# అభినవసరస్వతి.

సంపుటము ౧౨ { గుంటూరు, దుందుభి సం॥ ఆషాఢ శ్రావణములు. } సంచిక ౪, ౫

## స్వవిషయము.

ఆర్యులారా!

చైత్రమాసపత్రికయందుఁబ్రచురింపఁబడిన పత్నీస్మృతి స్వవిషయ
ములనుండి నాస్థితియంతయు మీకు విదితమయియే యున్నయది. అట్టి
విపత్సముద్రమున మునిఁగియున్నకతంబుననే పత్రిక సకాలమునకుఁ బ్రచు
రింపఁజాలకున్నవాఁడను. కీలకసంవత్సరాషాఢమాసమందీ పత్రిక ప్రా
రంభించి క్రమముగా నాలుగుమాసములు సకాలమునకుఁ బ్రచురించు
టయు నింతలో "శ్రేయాంసి బహువిఘ్నాని" యను నభియుక్తోక్తిసార్థ
కముఁజేయుచు జ్వరభూతమొకటి నన్నావేశించి యప్పటికి ౧౦ లంఘ
నములు చేయించియు వదలక పదిమాసములపర్యంతము బహుశ్రమము
ల పాలుచేసెను. అందువలన వత్సరార్ధమునకు వత్సరమునకుఁబ్రచురింపఁ
దగినసంచికలే ప్రచురించి తదాదిగానే రెండవసంపుటము ప్రారంభించితి
అది మొదలు 1921 సంవత్సరము తుదవఱకు ౧౩ వత్సరములును ననేక
శ్రమములకు లోనగుచున్నను సహించుచు యత్కించిత్కాలవ్యత్యాస
మప్పుడప్పుడు సంభవించుచున్నను బత్రిక నవిచ్ఛిన్నముగా నడపుకొని
వచ్చితిని. ఈపత్రిక సాగించినదాది కుటుంబమూలమున నేను పడుకష్ట
ములకు మితిలేదు. మొట్టమొదలు పుత్రోత్సవముజరిగి సంతోష
మొందఁగూర్చినను దదాది నాభార్యకు "హిష్టీర్యా" యనునొకరోగమే
ర్పడి షట్సంవత్సరార్ధపర్యంతము చాలపర్యాయములు భూశయనమే చే
యించుచు వచ్చెను. అదికొంచె ముపశమించుటయు నాత్మజుం డనేక
వ్యాధులకులోనై మృత్యువువాతఁ బడఁబోవుచు నపారదుఃఖమున కాస్ప
దుఁడగుచువచ్చెను. వాఁడించుక యారోగ్యవంతుఁడగుడు నింతికి నేఁడవ

మూసమున శిశువులు పుట్టిపోఁదొడంగిరి. వీనికన్నింటికిని నెట్లో యోర్పు కొని తనూజుని లోకోత్తరప్రతిభావిశేషమున కచ్చెరువందుచుఁ బరమానందపడుచుండ సప్తాబ్దమునసే జగదీశ్వరుఁడు వానిని స్వర్గమునకుఁ గొంపోయెను. అది మొదలుకొని యత్యంతదుఃఖపారావారమునమునింగి జీవచ్ఛవములమై వర్తిలుచున్న మాదంపతులకు సప్తమమాసమున సంతానముకలిగిపోవుటమాత్రము తప్పదయ్యె. ఆ మృతనష్టసంతానముల కొక్కొకట్టికి వ్యయముమాత్రము శతరూప్యములకుఁ దక్కువయయి యుండదు.

రాజవైద్యములు భూతవైద్యములు మందులు మాకులు మొక్కుటి లోపము లేకుండ నన్నియుఁ బూర్తియైనవి. పతన్మూలమైన విరాగము న దేశాటనమునకు బయలుదేరి పెక్కుతీర్థయాత్ర లాచరించితిమి. స్నేహితులైనవైద్యులు మేముపడుపాట్లకుఁ బశ్చాత్తాపపడి చేయుసాయ మేమియు లేమిని చింతాగ్రస్తులు కాఁజొచ్చిరి. అమలాపురనివాసులగు బులుసు దుర్గాప్రసాదరావుగారు రాయుర్వేదమునఁ బండితులు డి. గోపాలాచార్యులుగారి మెప్పునుగూడఁ బడసి గుంటూరుపురంబున. జికిత్సకులై యుండుచు మా సప్తమమాససంతాననష్టిని జక్కచేయుదుమని యుభయమొసంగుటయు మరల దుర్మతివత్సరారంభమున నాధర్మపత్నికిఁ బొకదలగర్భమేర్పడుటమూలమున నా ప్రసాదరావుగారి పొప్పునకుఁ జేరితిమి. తనయింటనుంచుకొని తగిన యౌషధముల నిచ్చుచు మమ్ముఁ బుత్రవంతులం జేసి పంపవలెనని పూర్ణప్రయత్నము చేసెను. సప్తమమాససంతాననష్టిని దప్పించెను. నవమాసపూర్తియయ్యెను. ఎవ రెన్నిశ్రమలుపడిననేమి యెవరి కర్మము వారలే యనుభవించితీర వలె. ప్రసవసమయమునకు బహువిధశ్రమములకు లోనగుటఁ గుగ్గరాస్వతికిఁ బొకతీరదయ్యెను. సంతతసాన్నిధ్యనివాసాదులకు స్వాతంత్ర్యమీయకున్నను నచ్చటఁ జేసినలోపమును మఱియేమియు లేదు. సుఖ

ప్రసూతితోనే సుతయొక్క యుదయించెనుగాని యాయువంతయే యు న్నకతంబున నంగన యమరపురికిఁ బ్రయాణము చేసియేతేరెను. తదాది ఱెక్కలువిఱిగినపక్షినై త్రోవయు డొంకయు దొరకక యటునిటు తిరుగుచుంటిని. గర్భవతియగు కాంతను దోడ్కొని గర్తపురిఁ బ్రవేశించిన దాది పత్రికాకార్యాలయముగూడ నక్కడికే మార్చుకొంటిని. అంతర్వత్ని కఖిలోపచారములు సేయుట కత్తగారిని మఱదలిని నన్నగారికొమరుని రప్పించుకొని వ్యయప్రయాసలకులోనయితిని. ఇల్లువాకిలి చేను జెట్రి సర్వము జానపాటిలోనేయున్నను దాత్కాలికోపయోగార్థమైన తత్తత్సామగ్రితోఁ దత్పురంబున వసించితి. తుదకుఁ గోమలిని గుంటూరున గోప్పఁజెప్పి యెక్కడివక్కడఁ బాఱవైచి జానపాటికిం జేరితిని.

చుట్టుపక్కములందఱుం జూచుటకుఁ జనుదెంచిరి. పారలౌకిక క్రియలు ప్రారంభించి పరిసమాప్తి నొందించితి. జననివిహీనమైన చంటిపిల్లను బోషించుటకు నాభాగినేయుండును నర్సారావుపేటనివాసియు నగు మేళ్ళచెర్వు కామయ్యభార్య నాపెద్దయన్నకొమరిత భారము వహించుకొని కొంతకాల మక్కడనే వసించెనుగాని యంతలో నానిసువునకు నాయుస్సులేమి నెలపదియైదుదినములకే నిర్జరపురికిఁజనఁగలిగెను. మేనల్లుఁడును, నన్నకూఁతురును, దుఃఖపూరితుఁడగు నన్నుఁ దోడ్కొని పోవుటయుఁ గొంతకాలము నర్సారావుపేటలోఁ బడియుండి.

చం॥ ఎనిమిదిమందిబిడ్డలను నేనును గంటిని, నొక్కబిడ్డనేఁ
బెనుచుచుఁ బెద్దఁజేసికొని ప్రీతుఁడనాటకు నోఁచ, నంతె కా
కనఘు, యజాతశత్రువగు నంగనకుం బెడఁబాసినాఁడ, నా
కనుకృతుఁడెం నభాగ్యుఁ డిలయందున వేఱొకఁ డున్నవాఁడొకో,

ఉ॥ పెండ్లముబిడ్డలెల్లరును బృథ్వికిఁ బాసినవార, లక్కసె
ల్లెండ్రును దల్లిదండ్రులును లేరు, సహోదరుఁ డొక్కఁడుండి యె

న్నేండ్లకుముందో వేఱుపడి యిచ్ఛఁజరించెడి, నాఁడు నిల్లుచో
కిండ్లెటో! నేనెటో! మఱి సుఖించుటెటో! యింకమీఁద సౌఖ్యమెటో!

కం॥ ఇవతలనుండిన చెంబును, నవతలఁ బెట్టియు నెఱుంగ, నత్తైసరేసీ
వివరముగఁ, బెట్టు టెఱుఁగను, భువి నీదేహంబు నెట్లుపోషింతునొకో,

అని వైరాగ్యమవలంబింపలేక వలపోసెడి నన్నుఁగాంచి బుద్ధిమంతులు కొందఱు పునర్వివాహము చేసికొమ్మని బోధించిరి.

చం॥ కుదరఁగలేదుకాని మది గొప్పవిరాగము నాకు నాక్రియన్
గుదిరియున్న సంసృతిని గోరక తాపసుఁడౌట యుత్తమం,
బదిమొదఁగూడనప్పుడు కులాంగనతోడ సుఖించు, చింతను
న్నదియెనో, యింత యస్థులకు నర్పణచేసి సుఖించుటర్హమా।

కం॥ అన్నమున కేమిభాగ్యాం, బన్నరయ, భగినిసుతుండా, యదియుదియునుగా
కున్న, మఱొక్కరో యిరువురు మన్ననిదినంబు లద్ది మాగతనమగునే॥

అని విచారించుకొని విచారించుకొని యందుల కంగీకరించితిని.

ద్వితీయప్రయత్నము చేసితిని. వివాహము చేసికొంటిని. కాని "భార్యాదుఃఖం పునర్భార్యా" యనియుండినను నష్టసంతాననష్టిగలిగియున్న నాయెడల "పుత్రదుఃఖం నిరంతర" మ్మనునది యేల సార్థకము గాకయుండును? కనుక నింకను గొంతకాలము మది స్థిమితమగుట కష్టము. స్వగ్రామము జాలపాడు. ఉన్న యీవదాస్తియు నచ్చట. ప్రకృతము పత్రికాకార్యాలయము గుంటూరున అప్పుడప్పుడు విశ్రాంతిఁ దీసికొనుచు వసించుటకేమి, నూతనవధువును బెంచి పెద్దచేయుటకేమి నర్సారావుపేటలోని మేనల్లునిగృహము. ఇన్నిచోట్లఁ దిరుగుచు నేకత్రివాసములేక యిట్లున్న కారణముననే నాపేరవచ్చు పత్రికలను నుత్తరములను సకాలమునఁ జూచుకొనుటకు సందర్భింపక ప్రత్యుత్తరములు వ్రాయవలసినవారికి వెంటనే వ్రాయుటయును బుస్తకములఁ గోరువారికిఁ బంపుటకును జందాధన మెప్పటిదప్పుడు రాఁబట్టుకొనుటకును ముఖ్య

లైన ఘోషకాదు దర్శించుటకును వీలుపడకయున్నయది. ఒక్కటననేల?
ఒక్క మరల గార్హస్థ్యమవలంబించితినన్న మాటయే కాని యింతయుఁ
బాటునఁబడుసంతవఱకు నిట్టిచిక్కులకు లోనయి యుండవలసినవాఁడ
నయితిని. ఈచిక్కులమూలముననే యింగ్లీషుసంవత్సరమునకు మొదటిది
యగు జనవరి కే ప్రారంభింపవలసిన ౧౮ సంపుటము మూఁడు నెలలు పాటు
పెట్టి మరల హైందవాబ్దమగు దుందుభి మొదటనుండి సాగించితిని. సా
గించియు వివాహప్రయత్నములచే వివిధస్థలములకుఁ దిరిగి విశేషశ్ర
మలు పడుచున్నకతంబునఁ దరువాతి సంచికలు సకాలమునకుఁ బ్రచు
రింపలేక రెండుమూఁడుసంచికలును నాలుగైదుసంచికలును గలిపి ప్ర
చురింపవలసివచ్చెను. ఎన్నిశ్రమలున్నను నేను నొక గృహస్థుడయితినన్న
మనోధైర్యము గలిగినకతంబున ముందు సాధ్యమైనంతవరకు సకాలము
నకే పత్రికఁ బ్రకటించుటకుఁ బ్రయత్నింతునుగావునఁ బత్రికాగ్రాహకు
లెల్లరును బరమదయాళువులై తమతమ చందాధనము సకాలమునకు
నొసంగుటలో వెనుదీయకుండుటకుఁ బ్రార్థితులు.

## అంటరానివాళ్లు.

(గత సంచికానుబంధము)

పంచముల స్థితినిగూర్చి కరవీరపీఠాధిపతులగు జగద్గురు శంకరా
చార్యులవారుకూడ నేమో వాక్రుచ్చిరట. అదియుఁ జూతము.

"ఆత్మోపలబ్ధికిఁ బ్రయత్నించని లౌకికుఁడు మతాంతరులగు మున
ల్మానులను, క్రైస్తవులను ప్రేమించి గౌరవించి హిందువులగు పంచము
లను దూరముగాఁబోయి హేయముగాఁ జూచుచుండుటయను ఘోరపాపముఁ
జేయుచున్నాఁడని నాయభిప్రాయము. ఉత్తమమగు పరిశుద్ధత నిఖిల
భూతములనుఁ బ్రేమించుటవలన గలుగునని మఱువరాదు. ఇప్పటికైనను
అగ్రజాతిహిందువులు పంచములు తమసోదరులని గ్రహించు టవసరము"

ముసల్మానులును క్రైస్తవులును మతాంతరస్థులే కాదు దేశాంతరస్థులుఁగూడ. వారి దేశములకు మనము పోఁగూడదనికూడ స్మృతులు చెప్పుచున్నవి. మనధర్మశాస్త్రములు మనదేశమువారికి సంబంధించినవే కాని యన్యదేశస్థులకు సంబంధించినవి కావు. అందువలన నన్యదేశస్థుల నంటవచ్చునని కాని కూడదనికాని తెలుపు నిర్దేశించి యుండలేదు. ఉండకున్నను వారు పంచములతోఁడి సహపంక్తిభోజనాది సంబంధము గలిగి యుండుటవలన వారినిగూడ మనము కొంతవఱకు నంటరానివారిగానే చూచుచుంటిమి. అంతియేకాని వారిని ద్వేషించుటయు లేదు. గౌరవించుటయు లేదు. సమభ్యస్తపాశ్చాత్యవిద్యులై సంఘసంస్కారుల మనుకొనువార లెవరో కొందఱు ప్రేమగౌరవములు చూపినను నది సర్వసామాన్యము గాదు. అయోమార్గాదులయందును న్యాయస్థానముల యందును వత్సంసర్గమున కొప్పుకొనుచుఁ బ్రేమగౌరవములు చూపుట లేదాయనిన నవి యధికారము నెడలఁ జూపునవి కాని వారివి కావు. పంచముల ధర్మశాస్త్రప్రకార మంటుటలేదు కాని హేయముగాఁజూచుట లేదు. అంటకుండినంతమాత్రమునసే వారిని హేయముగాఁ జూచినట్లైన మన యాఁడువాండ్రు రజస్వలలై యున్నపుడు వారిని, జాతాశౌచమృతాశౌచసమన్వితులగు సమీపబంధువులనుగూడ నంటము. అపుడు వారినిగూడ హేయముగాఁ జూచినట్లే.

ఇంతయేల. మడిగట్టుకొన్నప్పుడు కట్టుకొనని పుత్రకళత్రాదులఁ గూడ నంటనీయము. వీరందఱును హేయతాస్పదులే కావచ్చును. అట్టి లంటనిచ్చుటయే ఘోరపాతకము కాని యంటనీయకుండుట యెప్పటికిని గానేరదు. నిఖిలభూతములను బ్రేమించుటవలనఁ గలుగునది యంతఃపరిశుద్ధతకాని బాహ్యపరిశుద్ధతకాదు. అది స్పర్శాదులు వర్జించుట వలనఁ గలుగవలసినది. ఇంకను స్వాములవారిచే "నగ్రజాతిహిందువులు పంచముల తమసోదరులని గ్రహించు టవసర"మని చెప్పఁబడియెఁగాని

యస్మన్మత మది కాదు. శ్లో॥ ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతి సపశ్యతి" యను నార్యోక్తిప్రకారము సర్వభూతములను నాత్మసమానముగాఁ జూచువాఁడే యాత్మనుజూచువాఁడని మాయభిప్రాయము. ఈస్వాముల వారు కరవీరపీఠాధిపతులనియు జగద్గురు శంకరాచార్యులనియు మన వారు పేర్కొనియున్నారు కాని యది యసత్యము. శృంగగిరి పుష్పగిరి విరూపాక్షాది పీఠములవలె శంఖేశ్వరపీఠమని పశ్చిమదేశమునం దొక గురుపీఠ ముండెడిని. దానినే కరవీరపీఠమనికూడ ననుటగలదు తత్పీఠాధిపతులు వ్యాధిగ్రస్తులై మరణశంకచే హూణభాషాకోవిదులగు నొకరిని మంత్రోపదేశపూర్వకముగా సన్యసింపఁజేసిరి కాని తదుపరి తమరు మరల జీవించియే యుండిరి. అయినను శిష్యునిగూడఁ గొంతదేశము సంచరింపుచు నాచారవ్యవస్థ చేయుటకుఁ బంపియుండిరి. ఆపీఠమునకుఁ గొల్హాపుర రాజ్యమునను బరోడా రాజ్యమునను భూములుగలవు. తదుభయదేశాధిపతులును బ్రహ్మద్వేషులు. సంఘసంస్కర్తలమనుకొనువారు. హూణభాషావిదులు. అందువలన హూణభాషాభిజ్ఞులగు చిన్నస్వాములవారితోడి మైత్రినెఱపి మెల్లగా వారినిగూడ నవనాగరికమతమునకు లాగిరి. రాకున్న నగ్రహారముల హరింతుమని భయపెట్టిరి. అందువలనఁ దత్స్వాములవారు తదాజ్ఞాబద్ధులై తద్దేశమునఁ దదనుకూలమైన యాచారవ్యవస్థచేయ మొదలిడుటయు శిష్యులనేకులు తిరుగఁబడి పెద్దస్వాములవారికిఁ జెప్పుకొనిరి. వారు వీరికిఁ బూజానమస్కారములు చేయఁగూడదని శాసించిరి.

ఈస్వాములవా రాస్వాములవారికి శిష్యులో ప్రశిష్యులో యగుదురు. అయినను వీరియోగ్యత శ్లాఘ్యతమము. దేశాధినాధులుమున్నగు స్వల్పసంఖ్యాకులకుఁ దప్ప మిగిలిన దేశవాసిజనుల కనేకుల కనభిప్రేతమైన యీయాచార్యత్వమును నీయగ్రహారాదులును నాకేలయని యన్నియుఁ బెద్దస్వాములవారికే యర్పించి తా మీరీతి దేశనాయకులలోఁగ

లసి దేశోద్ధారణమునకై పాటుపడుచున్నవారు. కావున ఇట్టిస్వాముల వారియుక్తి యెంతవిశ్వాస్యమో వేఱె చెప్పనవసరము లేదు. ఇఁక గీతారహస్యగ్రంథకర్తయుఁ దత్త్వవేత్తయు ననమానపండితుఁడును రాజకీయవ్యవహారధురంధరుఁడును నగు బాలగంగాధరతిలకు మహారాజుమాటలను వినుఁడు. 1894 వ సం॥ గణపతియుత్సవములో మాదిగవాఁడొకఁడు తనగణపతివిగ్రహమును దీసికొనివచ్చెనఁట. వాని నుత్సవములో నెవ్వరును జేరనీయలేదఁట. అతఁడు తనకు వచ్చి చెప్పుకొనెనఁట, తాను పెట్టుకొన్న బండిలోఁ బెట్టుకొమ్మని చెప్పి పెట్టించెనఁట. పెట్టించుఁగాక! భగవంతున కెవఁడంటరానివాఁడు కాఁడో వాఁడంటరానివాఁడనుట భగవంతునియెడ నపచారము చేయుటయఁట. ఇట్లని పెద్దదోష మొకటి చూపుచున్నవాఁడు. భగవంతున కెవఁడును నంటరానివాఁడు లేఁడనికదా యీయనయభిప్రాయము. భగవంతుఁడు సర్వాంతర్యామియనియు నీభేద మంగములది కాని యాత్మలది కాదనియు మేము నెఱుంగుదుము. బ్రాహ్మణదేహమే చండాలదేహము నంటఁగూడదనుచుంటిమి కాని వీనియాత్మ వానియాత్మనంటఁగూడదని యనుచుండలేదు. వాఁడు వీఁడు నను వ్యవహారమున్నంతవఱకు నంటరానితనము వెంటనంటునదియే. ఇవి పైమెట్టుమీఁది మాటలు. చండాలుఁ డంటరానివాఁడని స్మృతి చెప్పుచున్నది. అది భగవదాజ్ఞ. అట్టిభగవదాజ్ఞకు మనము బద్ధులమైయుండవలె. ఉండకున్న భగవద్ద్రోహులమగుదుము. చూడుఁడు! మహాభారతము ఆశ్వమేధికపర్వము

శ్లో॥ శ్రుతి స్మృతి ర్మమైవాజ్ఞా యస్తా ముల్లంఘ్య వర్తతే। ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోపి న వైష్ణవః॥

శ్రుతియు స్మృతియు మదాజ్ఞారూపములనియు వాని నుల్లంఘించువాఁ డాజ్ఞాచ్ఛేదియు నస్మద్ద్రోహియు నగుననియు మద్భక్తుఁడైనను గాఁడనియు నీశ్లోకముచే భగవంతుఁడు చెప్పియున్నవాఁడు.

దీనినిబట్టి యితఁ డంటరానివాఁడనుటకాదు భగవంతునియెడ నప
చారముచేయుట యంటరానితన మనుగంటింపఁజూచుటయే. భారతదేశ
స్వాతంత్ర్యమునకుఁగాఁ బాటుపడెడివారిలోఁ బ్రథమగణ్యుఁడగుటవలన
బాలగంగాధరతిలకుగారు లోకమాన్యులగుటయే కాక మనవారిచే మహా
రాజశబ్దవాచ్యుఁడగుటయు మహాసంతోషకరము గీతారహస్యగ్రంథ
కర్తయగు తన్మహామహుని తత్త్వవేత్తృత్వముదగ్గరమాత్రము తగవు
లేకయుండలేదు. అసమానపండితుఁడనుట యంతకన్న ననాలోచితము.
నిమ్నజాత్యుద్ధరణసంఘమువారు పేర్కొనిన ధర్మనిర్ణేతలలో లాలా
లజపతిరాయిగారుకూడ నొక్కరు. నిమ్నజాతులవారి కొకస్థానము లేద
నియు నిపుడున్నస్థితిలో నున్నంతమట్టుకు దేశములో నైకమత్యము కుదు
రదనియు వారల కుచితస్థాన మాక్రమించునంతవఱకు నిజముగా మన
మొకజాతియని యనుకొనుటకు వీలులేదనియు మన మొకజాతిగా నిర్ణ
యింపఁబడుటకుఁ గావలసిన సమర్థత వారిసాయములేక సమకూరదని
యు నన్నికులములజనులును సమర్థులగునంతవఱకు జాతి యేర్పడదనియు
నీయన బోధించుచున్నవాఁడు. ఈబోధసారము సమస్తజనులును సమస్త
విషయములలోనను సమానులుగనే యుండవలెనని తేలుచున్నది.
ఇయ్యది పరమోత్తమమైన బోధ. ఇందువలననే యీయన దేశబంధు
బిరుదము సార్థకమయ్యెడిని. కాని యిది సిద్ధించుటయే దుర్ఘటము. మొ
దలు భరతఖండవాసులగు సమస్తజనులు నింతమందియని లెక్కించి
పిదప వారికుండిన స్థిరచరరూపమైనయాస్తి యావత్తునునందఱికిని సమా
నముగాఁబంచినప్పుడుకదా నిమ్నజాతులు పైకివచ్చియు నగ్రజాతులు క్రిం
దికిదిగియు నందఱును సమానులగుట. ఒకవేళ ధనదారిద్ర్యాదులనట్లు పంచఁ
గలిగినను నదృష్టమును దెలివితేటలును బంచుటకు బ్రహ్మవశముగాదు.
అది కర్మవశమే. కనుకనే యది కానిపని. బరోడామహారాజుగా రంట
రానితనమేమిటనియు విచిత్రమగు నీయాచార మొక్క హిందూదేశ

ములో మాత్రమే కనఁబడుచున్నదికాని యితరదేశములవారికి దీనియర్థము బోధపడదనియు వ్రాసియున్నవాఁడు. ఆయనవ్రాసినదంతయు యథార్థమే.

శ్లో॥ ఆర్యావర్తః పుణ్యభూమి ర్మధ్యం విన్ధ్యహిమాగయోః॥

అను నమరసింహకోశ ప్రకారము హిమవద్వింధ్యపర్వతములకు రెండింటికిని నడుమనుండిన భూమియంతయు నార్యావర్తమనుపేరఁ బుణ్యభూమియై యున్నయది. "చాతుర్వర్ణ్యవ్యవస్థానం యస్మిన్దేశే నవర్తతే, మ్లేచ్ఛదేశ స్సవిజ్ఞేయో హ్యార్యావర్తా దనంతర" మ్మను శ్లోకముచేఁ జాతుర్వర్ణ్యవ్యవస్థానములేక యార్యావర్తమున కవతలనుండెడి దేశమంతయు మ్లేచ్ఛదేశమని దీని కనుగుణముగనే విష్ణుస్మృతికూడఁ జెప్పుచున్నది. కావున వర్ణవ్యవస్థయే లేని హూణమ్లేచ్ఛదేశములలో నంటురానితనము లేకుంటయే నిజముకాని యాయాచారమున సేవగించుకొను బుద్ధిమంతు లందఱును నక్కడనే పుట్టవలసినవారు. పూర్వజన్మమందలి పుణ్యాతిశయముచేఁ బుణ్యభూమిం బుట్టిరి. పుట్టినదోషమున మొట్టమొదటినుండియు నున్న దేశాచారమున సేవగించుకొనిన నేమిలాభము కలిగెడిని? దేశాచారమును మార్పఁగూడదని స్మృతికర్తలగు ఋషు లెందఱెట్లు చెప్పిరో తిలకింపుఁడు. దేవలః- శ్లో॥ ఆమ్నాతావ ద్దేశధర్మో విచింత్యో దేశేదేశే యాస్థితి స్సైవకార్యా లోకద్విష్టం పండితా వర్జయంతి, దైవజ్ఞైర్ లోకమార్గేణ యాయాత్॥ మొట్టమొదలు దేశాచారమే యాలోచింపవలసినది. ఏదేశమం దేస్థితియో యదియే కార్యము. లోకవిరుద్ధమును బండితులు వివర్జింతురు. కాఁబట్టి యాస్తికుఁడు లోకమార్గమున నడచునది. శ్లో॥ యేషు దేశేషు యే దేవాః యేషు దేశేషు యే ద్విజాః। యేషు దేశేషు యచ్ఛౌచం యాశ్చ యత్రైవ మృత్తికాః। యేషు దేశేషు యత్తోయం ధర్మాచారశ్చ యాదృశః తత్ర తా న్నావమన్యేత ధర్మ స్తత్రైవ తాదృశః॥ [ఏదేశములయం దెవ్వరు దేవతలో యేదేశములయం దెవ్వరు బ్రాహ్మణులో యేదేశములయం దేది శుచిత్వమో యేదేశములయం దేది పాసి

ఘనమో యెట్టియాచారమో యచట వాని నవమానింపఁదగదు.అక్కడ పట్టినదే ధర్మము] యాజ్ఞవల్క్యః శ్లో॥ యస్మిన్ దేశేయ ఆచారో వ్యవహారః కులస్థితిః। తథైవ పరిపాల్యోసౌ యథావశముపాగతః॥ [ఆచారమును వ్యవహారమును గులస్థితియు నేదేశమున నెవ్వియుండునో యవ్వి యట్లే పరిపాలింపఁదగినవి.]

స్మృత్యంతరేచ. శ్లో॥ ఇతరస్మిన్ స్వకంధర్మం దేశేకుర్యా ద్విదేశికః కుర్వన్ ధర్మంతు తత్రత్యం తద్గత స్తత్రదుష్యతి॥ (ఇతరదేశమున కేగినపుడును స్వధర్మమునే యాచరింపవలయును. అట్లుకాక యచటి ధర్మమునే యాచరించినట్లైన దోషియగును.) ఇంతయేటికి. ఎవరు తమ దేశాచారముల వదలిపెట్టిరో యొకటి విచారించుదము. చిరకాలము క్రిందనే మనదేశమును గొట్టి కోలాహలముచేసి స్వాధీనపఱచుకొని మనదేశమునఁ బ్రవేశించిన మ్లేచ్ఛులును దమయాచారములఁగాని దైవతములఁగాని విడిచియుండలేదు. ప్రస్తుతము మనదేశ మాక్రమించి ప్రభుత్వము సేయుచున్న హూణులును దమదేశాచారముల నించుకంతయైనను మాన్చుకొనఁజూచుటలేదు. ఏదుర్బుద్ధులుపుట్టినను మనదేశస్థులకే పుట్టుచున్నవి.ఒకచెంప మహమ్మదీయులలోఁగలయువారును నొకచెపఁ గ్రైస్తవులలోఁగలయువారును నందరును మనవారే. ఈకలయుటకుఁగల కారణము బుద్ధిశూన్యతయని గుర్తెఱుంగక యెక్కువజాతిపైఁబడి యేడువ మొదలిడిరి. అగ్రజాతిజను లధమజాతిజనుల నంటనీయక యభాగ్యులఁ జేసి యణఁగఁ ద్రొక్కుటయే యన్యమతప్రవిష్టతకుఁ గారణమైన నెక్కువజాతివార లితరమతములఁ జేరుచుండుటకుఁగల హేతు వేమైయుండెడిని? ఎంతమంది యిదివఱకుఁ బ్రవేశించిరి? ప్రవేశించుచున్నారు? ప్రవేశింపఁగలరు. కనుక నిదియంతయు మన యుక్తాయుక్తజ్ఞాన శూన్యతయేకాని మఱియొకటకాదు. తురకలనుజూచిలాగులును నంగరఖాలును సేర్వానీలును గుచ్చుకుళ్ళాయిలును, హూణులఁజూచిబూట్లును

సూట్లును గోట్లును బంట్లములును గండ్లయద్దములును గ్రాపింగులును మూతటోపీలును మనము ధరించుచుంటిమికాని మనదోవతులును జీరెలును సేలువులును బిళ్ళగోచులును భస్మరుద్రాక్షలును వారు ధరించుటలేదు వారి తిలకశూన్యలలాటత్వమును మనమే యనుకరించుచుంటిమికాని మన గంధాక్షతలును గుంకుమహరిద్రాచూర్ణములును వారి మొగముల నలంకరించుటలేదు. శుచులమై స్వభాషయో దేశభాషయో మాటలాడవలసిన భోజనాదిసమయములలోఁ గూడ హూణమ్లేచ్ఛభాషల మనము మాటలాడుచుంటిమికాని యనవసరముగా వారు మనభాష మాటలాడుట లేదు. ఇట్టివాని నన్నింటిని విమర్శించుకొని మనస్థితిగతుల మార్చుకొని మంచిమార్గ మవలంబించుటకు మాఱుగాఁ బైన నంటరానితన మేమిటని యసహ్యపడు బరోడారాజుగారి ననవలసిన దేమియున్నది?

* నిర్బంధవిద్యానిరసనము. *

పశ్చిమదేశములందలి ప్రజలు స్వాతంత్ర్యసుఖమును బాగుగా ననుభవించుచున్నారనియు భరతఖండమునందలిజనులకట్టివైభవము లేదనియుఁ బలువురు నమ్మి యచ్చటనుండుపద్ధతుల నెల్ల నిక్కడఁగూడఁ బ్రవేశపెట్టుటకుఁ బ్రయత్నించుచున్నారు. వానిలో నిర్బంధవిద్యాదానము (Free and Compulsory Education) అనునదియొక్కటి. ఇట్టిదుర్బుద్ధులు భారతీయులకే పుట్టుచున్నవి. గోపాలకృష్ణ గోఖలేమున్నగువారు విద్యను నిర్బంధముగా బోధించుటకై యొకశాసనమును జేయఁజూచిరి గాని మనదొరతనమువారు మిక్కిలి వివేకముతో నట్టిప్రయత్నమును విఫలముఁగావించి మన కృతజ్ఞతకు బాత్రులయిరి. వారు స్వదేశమున నట్టియాచారములున్నను నయ్యవి మనదేశమునకుఁ దెచ్చుటవలనఁ బ్రజలకసంతుష్టికలుగునోపునని తలంచి సాధ్యమగు నంతవఱకు మన దేశమున వానినిఁ బ్రవేశపెట్టుట లేదు.

## నిర్బంధవిద్య.

నిర్బంధమనుమాటయే యాత్మగౌరవముగల ప్రతిమానవుని కర్ణములకును గఠోరమై హృదయమున కసహ్యమై యుండును. నిర్బంధము నింద్యమైనది. స్వాతంత్ర్యము పరమేశ్వరునిచేత నొసంగఁబడుచున్నది. అది మిక్కిలి పవిత్రమై యమూల్యమైన పదార్థము. దానికి భంగముఁ గలుగఁ జేయుట కెవ్వరికి నధికారము లేదు. భంగము వాటిల్లినపుడు మానవుఁడు తనసామర్థ్యమంతయును వినియోగించి ప్రాణముకంటెను ముఖ్యమయిన దానిని మరల సంపాదించికొనుటకై ప్రయత్నించును. కొన్ని విషయములం దొకమనుజుని స్వాతంత్ర్యమును నిషేధించుట సంఘమున కనుచితంబు కాదు. ఎట్లన నొకఁడు మఱియొకని ప్రాణమును గాని ధనమునుగాని యపహరింపఁదలచినపు డితరులందఱును వానిని వారించుట కధికారులగుచున్నారు. తన ప్రాణము ననుభవించుటకును దనధనము ననుభవించుటకును దన కధికారమెట్లుకలదో మఱియొకని కాతనిప్రాణమును ధనమును ననుభవించుట కధికారమున్నది. తత్ప్రతిబంధ మన్యాయ్యంబు గావున నది కలుగకుండ సంఘము ప్రవర్తింపవచ్చును. కాని యొకఁడు భాషయొక్క యక్షరముల నభ్యసింపఁడేని గణితశాస్త్రపరిచయము నొందఁడేని దేశచరిత్ర నెఱుంగఁడేని మనుజున కనుచితములైనట్టియుఁ బశువునకుమాత్రమే యోగ్యములయినట్టియు సిద్ధాంతములను గ్రహింపఁడేని నమాయికులను బాధించు నుపాయములను దెలిసికొనఁడేని వానిచేత నట్టిపనులను బలాత్కారముగాఁ జేయించుటకు సంఘమున కెట్టి యధికారమును గలుగనోపదు. ఎవని యజ్ఞానమువలన వానికే కీడుకలుగును; దాన లోకమున కంతహాని లేదు. అక్షరముల నెఱుంగకుండుట మఱియొకనిఁ జంపుట కాదు, వానిసొమ్ము నపహరించుటయును గాదు. చదువునేర్చినవాఁడు చదువురానివానికంటె నెక్కుడు చాకచక్యముతో లోకమున వ్యవహరించుఁగాక. కాని చదు

వు లేనివాఁడు లోకమునకు ద్రోహము చేయువాఁడనుటమాత్ర మనుభవ
మునకు విరుద్ధమయినమాట. చదువఁగలవాఁడే తఱచుగా శాసనముల
నుల్లంఘించి ఘోరములయిన కార్యములకుఁ గడంగుచున్నాఁడు.
అతఁడు శాసనములకు దొరకకుండ నుండుటకుఁ దన చదువు
నుపయోగించుచున్నాఁడు. చదువు నభ్యసింపనివాఁడు చేయుపనుల కంటె
నది యభ్యసించినవాఁడు చేయుపనులు కడుఘోరములగుచున్నవి. మొ
దటి వాఁడొక మనుజుని లేక కొందఱినిమాత్రమే వధించును, కొంత ద్ర
వ్యమునుమాత్రమే యపహరించును. రెండవవాఁడన్ననో వంశములు
వంశములు నిర్మూలము చేయుచున్నాఁడు, కొంపలుకూల్చి స్థలభాండవిసర్జ
నముఁ గావించుచున్నాఁడు. ఈతఁడు తడిగుడ్డతో గొంతులుకలు కోయు
వాఁడు, వీనికలముపోటు నిరక్షరాస్యుని కత్తిపోటు కంటెను విషమమ
యినది. ఇతఁడు దేవునికి భయపడఁడు, గురువును బాటింపఁడు. నిరక్ష
రున కొక దయ్యమునందైనను భూతమునందైనను భక్తికలదు గావునఁ
బాపకార్యముల కించుకయైనను దూరముగానుండును. ఇట్లు చదువులేని
వాఁడు లోకమున కంతయుపాయంబును గలిగింపఁడుగాన వానిని బాధించి
చదివింపవలసిన యవసరంబు లేదు. అట్టియధికారంబును గానరాదు.
సంఘములోఁ బహుళసంఖ్యాకులకు నిర్బంధవిద్య యిష్టమయినయెడల
వారది తమబిడ్డలకు మాత్రమే ప్రసాదింపనిండు. ఇష్టములేనివారిపై
నది రుద్దుటకు వీరెవ్వరు? బహుళసంఖ్యాకు లల్పసంఖ్యాకులను శిక్షిం
చుట యేటిన్యాయము? వ్యక్తిస్వాతంత్ర్యభంజకంబగు సంఘదౌర్జన్యం
బుదుస్సహంబు. అది యభినవనాగరకుల లక్షణంబు. దినమున కెన్నిప
ర్యాయము లేపదార్థము లెంతెంత భుజింపవలయునో సంఘముచేత నిర్ణ
యింపఁబడుచున్నది. అట్టిమితిని మీఱినవారు దండింపఁబడుచున్నారు.
ఒకతెను వివాహమాడుటకు సంఘముచే నేర్పాటుచేయఁబడిన స్థలము
నకుఁ బోవలయును. ఆమెను విడిచిపెట్టవలెనన్న మఱియొక స్థలమున

కేగవలసియున్నది. స్త్రీయును బురుషునివిషయమున "రిజిష్టారు" అనువాని దగ్గఱకును "డైవర్సుకోర్టు" అను-చోటునకును బాణిగ్రహణార్థమును వివాహవిచ్ఛేదము నిమిత్తమును వెళ్లవలయునఁట.' ఒకఁడు మఱియొకదేశము నందలిమానవుని యందు ద్వేషములేనివాఁడయ్యు బలాత్కారముగా యుద్ధరంగమునకుఁ దీసికొనఁబడి యచట నాతని జంపునట్లు చేయఁబడుచున్నాఁడు. ఒకఁడు తనకిష్టము గాకపోయినను జదువుకొనవలె; ఇష్టమైనవి కాబట్టి పుస్తకములను బఠింపవలెనఁట కావున బలువురు సమ్మతించినమాత్రాన నిర్బంధవిద్య మంచిది కానేరదు. మఱియును నయ్యది పలువురకు సమ్మతమగుచున్నదనుటయును సత్యముకాదు. ఏలయన నప్పుడు నిర్బంధమునకే యవసరము లేదు. ఎవ్వరినిర్బంధమున్నదని ప్రజలు భోజనముచేయుచున్నారు? స్వాభాకమయిన విషయమందు విధి ప్రవర్తింపదు; అట్లు ప్రవర్తించుట పిష్టపేషణమగును. కావున విద్య నభ్యసింపవలయునఁయు నభ్యసింపని వారు దండింపఁబడవలయుననియు, శాసించుటవలన లోకమున బహుశసంఖ్యాకు లట్టి విద్య నభిలషించువారు గారని వ్యక్తమగుచున్నది. శాసించువారిలో ననేకుల కది యభిలషితము కావచ్చును. కాని వారి కభిలషితమయినది లోకులందఱికి నభిలషితమగునా? వారా లోకులు? మండూకములు కూపమే లోకముగావున మాకు-నిష్టమయిన పురుగులు లోకమున జీవకోటి కంతకు నిష్టమైయుండునని వాదింపఁగలవు. తద్భోజనమునే విధింపఁగలవు! ఈవిద్య, కావలసినవారికా, యక్కఱలేనివారికా? కావలసినవారికి నిర్బంధ మనావశ్యకము, అక్కఱలేనివారి కన్యాయ్యము.

## విద్యాదానము.

మన నవనాగరకులు విద్య నెల్లవారికి దానముచేయుచున్నారమని చాటించునప్పుడు "ఆహా!" కర్ణులొకఁడు కాదు, అనేకులు కురుక్షేత్రముయొక్క బూడిదనుండి లేచి మనల నుద్ధరించుచున్నవారు" అని

నమ్మి సంతోషించుచుందము, కాని, పన్నులకై పత్రిక మన గుమ్మముల
యొద్దకు వచ్చినతోడనే, మన యభినవకర్తల నిజస్వరూపము వ్యక్త
మగుచున్నది. ఈయఁదలఁచిరేని, ధనము నపేక్షింపకయే విద్య నొసం
గెదరుగాక కాని బాధించిధనమునుసంగ్రహించి విద్యను గఱపుటమా
త్రము చేయకుందురుగాక. దండించిద్రవ్యమును సేకరించి దానితో
నొదఱికయినఁ బిండివంటలతో భోజనముఁబెట్టవచ్చును. ఇదియెట్టి సం
తర్పణ? ఇది యుచితమెట్లగును? "మొత్తో మాకు యేవిద్య యక్కఱ
లేదు. మేమేమడియో దున్నుకొనిజీవింపఁగలము." అని మొఱపెట్టుచు
న్నవారిచేఁ జదివించుట యొకపాతకము. అట్టివిద్యకై వారివలన ద్రవ్య
మునుసంగ్రహించుట రెండవది.

మఱియు, విత్తము స్వీకరింపకయే విద్యాదానముఁజేసినను
నయ్యది నింద్యమయ్యెడిని. ఏలయన, విద్య యొకముఖ్యముగా నావశ్య
కమయిన పదార్థము కాదు. అది యొక భోగోపకరణము (luxury) అని
చెప్పవచ్చును. మానవు లన్నము లేక జీవింపఁజాలరుగాన నన్నమును
సమకూర్చుటకై వినియోగింపఁబడినధనము వ్యర్థముకాదు. కాని వారు
వ్రాయ లేక పోయినను జదువ లేకున్నను లెక్కల నెఱుఁగనివారయ్యును
జీవింపఁగలరు; అట్టిపరిచయముఁగల్గినవారి కంటెను వీరిజీవనము సుఖత
రము. అక్షరాది పరిచయ మత్యంతావశ్యకముకాదు కాఁబట్టి తదర్థమ
యిన వ్యయము సాధారణజనులకు దుకూలములనిమిత్తము తమస్వల్ప
ధనమును వెచ్చించుటవంటిది. కూటికైనను లేక లోకమునం దనేకులు
బాధపడుచుండ విద్యాశాలానిర్మాణమునందు వ్యగ్రులయిన సంఘసం
స్కర్తలచర్య నేమనవచ్చును! మ్రింగ మెతుకు లేదుగాని మీసాలకు
సంపెఁగనూనె! లేనియవసరములఁగల్పించుటయు నవితీర్చుటకై క్రొత్త
పన్నులను విధించుటయు నభినవబుద్ధిమంతుల లక్షణము. పశ్చిమఖండ
ములందుదలి ప్రజలు తఱచుగా నమితమయినకరభారముక్రింద నడఁగి

పోవుచున్నారు. వైద్యుత దీపములు కావలయునని యేల యేడ్చుచు
న్నాఁడు ? అట్టివి నిర్మించుటకై యెంత ధనవ్యయమేల ? మనదేశమున
విమానాదులున్నవా? లేవు కావున మనదేశము మిక్కిలి వెనుకఁబడియున్నది
మఱియు, మనదేశమున నిర్బంధవిద్య కలదా? లేదు కావున మనదేశము
నిబిడాంధకారమున మునిఁగియున్నది! విద్యావ్యాప్తికై దొరతనమువారు
మిక్కిలి తక్కువమైన మొత్తమును వినియోగించుచున్నారని వారిని
సంఘసంస్కారులిటుల నిందించుచున్నారు. "జర్మనీదేశమున నూటి కెం
దరు, బ్రిటీషుదేశమున నెందరు రష్యాయందెందఱు భరతఖండమున నెం
దఱు, విద్య నేర్చినవారో చూడుఁడు. అన్నిటికంటెను భరతఖండమునందే
తక్కువసంఖ్య. ఈదోషము దొరతనమువారిది." కాని దొరతనమువా
రావశ్యకమయినదానికంటె నధికముగా సొమ్మును విద్యకై వినియోగించు
చున్నారని నమ్మవలయును. చదువఁగలవారును మనదేశమునఁ గొందఱు
మాత్రమే యున్నను దానికి లోటులేదు. జర్మనీమున్నగు దేశములందుఁ
బ్రజలు విద్యాధికులే కదా; వారిచర్యను బరికింపుఁడు — ఒకరి నొకరు
భక్షించుటకై తమపాండిత్యము నుపయోగించుచున్నారు. భరతఖండ
మునఁ గావలసినది నూతనముగా విద్యాలయములను నెలకొల్పుటకాదు.
మఱి యేదియన నిపుడున్న వానినే మూసివేయుట. అట్లు చేయుటవలన
విద్యకొఱకు ధనవ్యయము తప్పిపోవును. పన్నుల మొత్తమునుండి యీ
భాగమును దీసివేయవచ్చును. అప్పుడు జనులకుఁ బన్నుల బరువు తగ్గఁ
గలదు. సొమ్ము తమహస్తములయందే యుండుటవలన దానిని వారు ధర్మ
కుపయుక్తములైన కార్యముల కుపయోగించుకొనఁగలరు.

మఱియు, లోకమున నెందఱు విద్య తమకుఁ గావలయుననుచు
న్నారు? ఆకలిలేనివాని గొంతుకలో లడ్డుమున్నగు పదార్థములను గ్రు
క్కినచో నాతఁడువాని నాస్వాదింపలేకపోవుటయేకాక వాంతిమొదల
గున వికారములకు లోనగును. విద్యాభిలాషలేనివానికి బలాత్కార

ముగా విద్యనొసంగుటవలన దానిరుచి నతఁ డెఱుంగ లేక పోవుటయే కాదు. — గర్వాదిమనో వికారములకు వశుఁడగును. వాఁడు గ్రంథము లకు విపరీతార్థములను గల్పించి లోకమునకు ద్రోహము చేయును. విద్యకు ముందట జిజ్ఞాస (తెలిసికొనవలయునను కోరిక) యుండవలయును. అది లేనివిద్య కీడునకు మూలమగును. జిజ్ఞాసగలవారు గురువుల యొద్ద కేగి ధనికులయినచో ధనము నిచ్చియో లేకున్నఁ బరిచర్యచే వారియనుగ్రహము సంపాదించియో తామెఱింగినవిద్యను వారిచేఁ జెప్పియో, "గురుశుశ్రూషయావిద్యా పుష్కలేన ధనేనవా। అథవావిద్యయావిద్యా" అను వాక్యముచొప్పున విద్యను స్వీకరించి కృతార్థులు కాఁగలరు.

విద్య.

విద్యయనునది నిజముగా విద్య కాక పోవచ్చును; ముఖ్యమనఁ బడుచున్నది. (Elementary) ముఖ్యముకాక పోవచ్చును. అక్బరు మున్నగురాజులు వ్రాయ లేనివారయ్యు రాజకార్యములను బాగుగా నిర్వహింపఁ గల్గియుండిరని విన్‌సెంట్‌స్మిత్ మొదలయినవారు వ్రాసియున్నారు. హైదరాలీ శివాజీ మొదలగు వీరులుకూడ నట్టివారేయని చరిత్రలందుఁ గొందఱు నుడివియున్నారు. చదువు లేక పోవుట వీరివ్యాపారముల కాటంకము గలిగించియుండదుగాన ముఖ్యమని చెప్పబడుచున్న చదువు ముఖ్యము కానోపదు. చదువులేనివారు గొప్పరాజ్యములే పరిపాలింప వచ్చును; చిన్నపనులను జేయజాలరా? వ్రాఁతతో సంబంధముగల పనికి వ్రాఁతముఖ్యముకావచ్చును. ఎట్లన, లేఖనమే వృత్తియైనవానికి లిఖించుట. కర్షకుని కది యావశ్యకము కాదు; అక్షరజ్ఞానము లేని వాఁడు భూమిని దున్నుట కసమర్థుఁడగునా? వీథిలోఁ గూరలనమ్ము వారు దేవిశ్వవిద్యాలయము నుండి దిగియున్నారు? బడులలో గణితశాస్త్రాభ్యాసముఁ జేసినవారగుటచేతనా చాకలి గొల్ల మొదలయినవారు బట్టలు పెరుగు మున్నగువస్తువుల లెక్కలను సరిగాఁ జెప్పఁగలరు? విద్య

యున వ్రాయుటమాత్రమే యగునా? వ్రాయఁగలవారు దమపనులను బాగుగాఁ జేయఁగలరని మీరు వాదింపవచ్చును. వడ్రము నేర్చినవారు నాగలి విరిగినప్పుడు దానిని సుకరముగాఁ జక్కఁజేసికొనఁగలరు, గాన భూమిని దున్నుకొని బ్రతుకువారందఱును మొదట వడ్రము నభ్యసించి యుండవలయును! కంటకాదిబాధలు వారికిఁ గలుగుచుండునుగావున వారు శస్త్రచికిత్సాపరిచయముఁ గూడ నొందవలయును! దేశము నందలి చట్టములు మున్నగునవి తెలిసినవారై యుండవలయును. ఇట్టిపరికరముల కంతమెక్కడ? కొంతయుపయోగ మున్నమాత్రమునఁ జదువు విధింపఁబడునెడల వడ్రము మున్నగునవిమాత్ర మెట్లు విధాయకములుగాకపోవును? మఱియు నక్షరములతో నిమిత్త ములేనిపనులను జేయనెంచినవారి కక్షరములను విధించుట వడ్రముచే జీవింపఁదలఁచినవారికి వస్త్రములనేయుటను విధించినట్లుండును. "పృష్ఠ తాడనా ద్దంతభంగః" కావున మనదేశమున స్త్రీపురుషు లనేకులు విద్యలేనివారై యున్నారనుట కల్ల.

2 నవనాగరకులుద్దేశించువిద్య దోషయుక్తమయినది. అది నాస్తి కత్వము నంకురింపఁజేయును. పెద్దలయం దవిధేయతను గూర్చును. అబద్ధములను మాటగట్టించును.

3 సంఘసంస్కర్తలు ముఖ్యమని నిర్ణయించిన విద్యతో వారు సంతోషించియుండఁగలరని యెట్లుచెప్పఁగలము? ఇప్పుడు వారు ప్రాథమికవిద్య [Primary Education] అనునదిమాత్రమే బాలురందఱు నవశ్య మభ్యసింపవలయునని పల్కుదురు. కాని క్రమముగా విద్యను హెచ్చుచేసి మధ్యమవిద్యను (Lower Secondary grade) పిమ్మట నున్నతవిద్యను (High School course) గూడ నిర్బంధముగా నభ్య సింపవలయునని విధింపఁగలరు. పట్టపరీక్షాంతముకూడ విద్యానిర్బంధ ము కలుగవచ్చును. ఆశకు హద్దులేదుకదా. ఇట్లు విద్యార్థులు తమశక్తి

ధనము ప్రాణము, విద్య కల్పింపవలసివచ్చును. నడుచుట దేహమునకు మేలుచేయును; కాని దానికి మితియుండవలెనుగదా.

4 విద్యావిషయమున బలాత్కారమువలన బాలు రుచితవ్యాపారములనుండి మరలింపఁబడుచున్నారు. వారు విద్య ముగిసినపిమ్మటఁ గ్రొత్తవ్యాపారమునకుఁ దగియుండరు. అభ్యాసము లేకపోవుటవలనఁ దమతల్లిదండ్రుల వృత్తియందును సమర్థులుకానేరరు. క్రొత్తది పట్టుపడలేదు, ప్రాతది యూడినది, పుత్త్రులక్షేమముఁగోరి వృత్తిని నిర్ణయించి దానికిఁదగినవిద్యను నిశ్చయించుటకు జననిజనకులే తగినవారు. వారట్టి విద్యను దమగృహములందును గురుకులములందును నభ్యసింపఁజేయఁ గలరు. మార్వాడీబాలురు పారసీకబాలురు మొదలయినవారిందులకుఁ దార్కాణము. వారు చిన్నతనమునుండియుఁ దమపెద్దలయొద్ద నివసించి యుచితవ్యాపారమునఁ బ్రవర్తించియుఁ గావలసినవిద్యనభ్యసించుచున్నారు. ధనమును సంపాదించుచున్నారు. ధర్మకార్యముల నొనరించుచున్నారు. వారు సంఘసంస్కారులపాఠశాలలందుఁ బరీక్షలందు ఖండింపఁబడుచుఁ గృశించుచున్నవారుగారు; ద్రవ్యమునార్జించుటకు మాఱుగా దానిఁ గోల్పోవుచున్నవారును గారు.

5 కొన్నికుటుంబములకు ధనము చాలదు. బాలురుసహితము పాటుపడి కొంతద్రవ్యమును దెచ్చినఁగాని యవి కూలిపోవును. మనసంస్కారు లట్టికుటుంబములను బోషింపఁగలరేని పిల్లలు పనిమాని పాఠశాలలను బ్రవేశింపఁగలరు.

6 విద్యనుగఱపుపద్ధతియం దనేకలోపములుండవచ్చును. కావునఁ బ్రజలందఱికిని దానిఁ బ్రయోగించుటవలన వారికి హానికలుగును. నిర్బంధము లేనియెడల నొకస్థలమునందలిపద్ధతి కూడనిదైనను నితరస్థలములందలి పద్ధతులట్టివి కాకపోవచ్చును గాన నష్టము సమానము కాదు. అక్షరములు లేనిమాటలు కంఠపాఠము లేనిపాఠములు వ్యాకర

ణము లేనికావ్యములు, తత్త్వశాస్త్రము లేనిప్రకృతిశాస్త్రములు మఱియు నీటిమార్గములయినను దీర్ఘకాలము నిలువవు; అవి మాఱుచుండును; పుస్తకములుమున్నగునవి మాఱుటవలనఁ బ్రజలకు బాధ కలుగుచుండును. "జ్ఞానము సంపాదింపఁదగినదికాదా?" అని సంస్కారు లడుగవచ్చును. "క్షీరములు త్రాగఁదగినవి కావా?" అని వీరిని మనముప్రశ్నింపనగు. క్షీరములు దేహమునకుయోగ్యము లేకావచ్చును.అంతమాత్రముచే నవి ప్రతిమనుజుఁడును ద్రాగవలయుననియు, లేనిచో నతఁడు దండింపఁబడుననియు, వాదించుట హాస్యాస్పదము కాదా? అటులనే జ్ఞానము మంచిదే యగుఁగాక; కాని,నిర్బంధముచేత దానినొసంగుట నర్వ్యానకు గుఱికాఁగలదు. మఱియు క్షీరము దకముతోఁగూడి యుండవచ్చును. విషమిశ్రితములు కావచ్చును. విద్యయు నిరర్థకవిషయములతో నుండఁగలదు; దుర్విషయములకు సంబంధించియు నుండఁగలదు; కావున నవశ్యము గ్రాహ్యామెట్లు కాఁగలదు? ఒకఁడు పాలను దనయింటియొద్దనే సేవింపవచ్చును, ధర్మశాలయందుమాత్రమే సేవింపవలయునను నియమమేల? అటులనే విద్య నొకఁడు తనగృహామునందే స్వీకరింపఁగలఁడు. నిర్ణీతపాఠశాలయందుమాత్రమే స్వీకరింపవలయుననుట మంచిదా?

7 మఱియు, నిట్టి విద్యాలయములందు నిర్బంధముచేత విద్య నభ్యసించివచ్చినవారు తఱచుగాఁ దమ స్వల్పజ్ఞానమునకు గర్వపడుచుఁ బెద్దలను బరిహాసించుచు న్యాయ్యములయిన శాసనముల నతిక్రమించుచు, నుపద్రవకరములయిన నూతన శాసనములను సృష్టించుచు, దొంగ వ్రాతలను వ్రాయుచుఁ గొండెములఁ బల్కుచుఁ గూటసాక్ష్యముల నిచ్చుచు లోకులకును బరిపాలకులకును ద్రోహముఁ జేయుచుందురు. కాఁబట్టియే భర్తృహారి యిటుల వచించియున్నాఁడు:—

"అజ్ఞః సుఖమారాధ్యః సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి" (అజ్ఞుఁడు సుఖముగా నారా

ఢింపఁ దగియున్నాఁడు, విశేషజ్ఞుఁడు సుఖతరముగా నారాధింపఁబడుచున్నాఁడు, కాని జ్ఞానలవదుర్విదగ్ధుఁడైన నరుని బ్రహ్మకూడ రంజింపఁ జేయఁజాలఁడు] ఇప్పుడు రుచినిమిత్తమై పోపు [Pope అను నాంగ్లేయకవి] చేతఁ బదార్థము నించుక సంస్కరించుచున్నాఁడను:—

A little learning is a dangerous thing; Drink, deep or taste not the Pierrian spring.

(కొంచెమైనవిద్య యుపద్రవకరమయిన వస్తువు కావున లోతుగాఁ ద్రాగుము; లేకున్న జ్ఞాననిర్ఝరరుచియైనను జూడకుము.)

గోవిందరాజు హరిశ్చంద్రరావు కాకినాడ.

## రాజువలన లాభములు.

అధ్యక్షుఁడు పరిపాలించు పద్ధతి (Republic) కంటె రాజుపరిపాలించు పద్ధతి (Monarchy) వలన లోకమునకు లాభము లధికములై యున్నవి. ఎట్లనః—

(1) రాజు తనవంశజులు రాజ్యమును శాశ్వతముగా ననుభవింపఁ గలరని నమ్మువాఁడుగాన మిక్కిలి మమకారముతోఁ దన ప్రజలను బరిపాలింపఁజూచును. అధ్యక్షుఁ డట్లు చేయఁడు; అతఁడు కొలఁది కాలమును మాత్రమే యధికారియై యుండవలసిన వాఁడుగావున జనులయందభిమానము లేనివాఁడై తాత్కాలికలాభమునుమాత్రమే యపేక్షించి రొట్లోకాలక్షేపము చేసి చన్నును. మఱియు నతఁడు "దీపముండఁగానే యిల్లుఁ జక్కఁబెట్టవలెను" అనుసామెతచొప్పునఁ దనకు నిర్ణయింపఁబడిన కాలమున దొరికినంతసొమ్ము నధర్మమార్గములచేతనయినను సంగ్రహించుటయందును దనవారికి గొప్పపదవుల నిప్పించుటయందును దనశక్తిని వినియోగించును; తనతరువాత దేశ మెట్లుండిన నేమిశి మార్గమధ్యముననున్న కుటీరమునందుఁ బ్రవేశించి వంటచేసికొనుటకై యొకఁడు దానియాకుల నూడఁదీసి పొయిలోఁ బెట్టునటుల నెంఘాధ్యక్షుఁడును జేయుచుండును.

ఆ కుటీరమునందు శాశ్వతమయిన యధికారము తనకుండిన పక్షమున నాబాటసారి యారీతిగాఁ బ్రవర్తించి యుండఁడు; ఆతఁడప్పుడెక్కడ నొక యాకులభించినను దానిని దనకుటీరమునకుఁ జేర్చును. ఒకఁడొక నదిని సమీపించి, యచ్చటనున్న నావనెక్కి యావలిగట్టునకుఁ జని, యటుపిమ్మట నావను ధ్వంసముచేయును; ఒకఁడివ్విధంబున మొదట దేశమునఁ గొందఱ నాశ్రయించి వారియనుమతివడసి యధ్యక్షపదంబును సంపాదించి యనంతరము వారిసహాయ మక్కఱలేదుగాపున వారిపైఁ బన్నులుమొదలయినవి విధించి వారిని బాధించును. మఱియొకఁడానదితో నిత్యము సంబంధముగలవాఁడు కాఁబట్టి యానావయొక్క యపేక్ష గల్గినవాఁడై, నదిదాటినతరువాతఁగూడ నావయొక్క క్షేమమునే జూచుచుండును. ఇట్టివాఁడు రాజు; ఈతఁడు తనజీవితకాలమునందలి ప్రజలుమాత్రమే సౌఖ్య మనుభవింపవలెనని కోరువాఁడు కాఁడు. తనతరువాత వచ్చు మనుమలుమున్నగు వారికాలమునందు జనులుకూడ సుఖులై యుండవలెనని కాంక్షించువాఁడు. భూమి ధేనువువంటిది. రాజు దానిఁ బోషించుచు లాభమొందును. అధ్యక్షుఁడు దానికి నష్టముఁగలిగించియైనను దాను ద్రవ్యమును స్వీకరింపఁజూచును, గానఁ బొదుగునుగోసి పాలుద్రాగునట్టివాఁడు; ఆవునేవధించి భక్షించునట్టివాఁడు. పృథ్వీపతికి దేశముయొక్క యభ్యుదయమునందు భాగమున్నది; అతఁడు ప్రజ లభివృద్ధి నందినకొలఁది నభివృద్ధి నందగలఁడు. ఆతనికి, దన సంతతియందును మక్కువగలదు; వారి క్షేమము జనులక్షేమమునుబట్టి యుండఁగలదు. కావునఁ దనసంతతియొక్క లాభమునకై యతఁడు రాఁబోవునట్టి ప్రజలయొక్క లాభమునుగూడ విచారింపవలసినవాఁ డగుచున్నాఁడు. వృక్షాదులను గూల్చినయెడల రాజునకును నష్టముకలుగును. ఫలాదు లుండవు గదా. తటాకాదులకుపద్రవముఁ గలుగఁజేసినచో, సస్యాదులులభింపవు. జనులను హింసించినపక్షమున దేశమున విప్లవముసంభవించి రాజకుటుం

బనయునకే ముప్పువచ్చును. ఇట్టి విషయము లాలోచించి నరనాథుఁడు యుక్తప్రవర్తన గలవాఁడగుచున్నాఁడు.

(2) మఱియు, భూపతి మంచివాఁడగునేని దేశమునందఱును దనపక్షమువారగుచున్నారు. అతఁడు దుష్టుఁడయినచో దుష్టులు కొందఱు మాత్రమే తనవారగుదురు. అధ్యక్షుఁడు దుర్జనుఁడయినను నాతనికి సాయముఁజేయు వారనేకులుందురు. వారిసంఖ్య దుష్టుఁడయిన రాజుయొక్క యనుచరుల సంఖ్యకంటెఁ బెద్దదియైయుండును. కావున వారి బలమున నధ్యక్షుఁడు రాజుకంటె ఘోరతరములయిన కార్యము లొనరింపఁగలఁడు. తఱచుగా నృపపక్షమనునది యుండదు. ఆతనికిఁగాని యాతని యౌరసపుత్రునకుఁగాని సింహాసన మందకుండఁ జేయఁబడినప్పుడు దానిని సహింపఁజాలక కొంద ఱాతనిపక్షమువారుగా నేర్పడుచున్నారు. ఇంగ్లాండునందు రాజును దొలఁగించుటవలన జాకోబైట్సు మొదలయిన తెగలు బయలుదేరి తత్పక్షమునఁ బోరుసల్పుచుండిరి. రాజును దుర్నీతుని దీసివైచినను నాతని పుత్రుని సింహాసనభ్రష్టునిగాఁ జేయకుండినచో రాజపక్షమనునది క్రమముగా నశించి రాజును బ్రజలు నైకమత్యముతో నుండఁగలరు.

ప్రశ్న:— రాజు జీవితకాలమంతయు నుండునుగాన నతఁడు దుష్టుఁడగునేని జనుల కాతనివలన బాధయాతనిమరణమువఱకు నుండును. అధ్యక్షుని యధికారము కొంతకాలము మాత్రమే యుండునది గావున నతఁడు దుర్జనుఁడయినను నతనివలన లోకమునకు నష్టము కొంచెమే యగును. అధ్యక్షుఁడే మేలు.

ఉత్తరము.— అధ్యక్షుఁడు తంత్రములవలన నియతకాలమయిన తరువాత మరలరాఁగలఁడు. కొందఱుదురాత్ములవ్విధంబునఁ బట్టణపాలక సంఘములమున్నగువానియందుఁ జిరకాల మధ్యక్షపదవి ననుభవించుట లేదా? మఱియు నతఁడు తనమిత్రుల కట్టిపదవివచ్చునట్లు చేసి వారిద్వా

రమునఁగూడ లోకమున కపకారము సాగించుచునే యుండఁగలఁడు. కాఁబట్టి యధ్యక్షుఁడును దీర్ఘకాల మపకారి కావచ్చును. రాజులు కొందఱు జిరకాలము జీవింపఁజాలరు; కావున నొకరాజు దుష్టుఁడుగలఁడేని వాఁడు శీఘ్రముగాఁ జనిపోవుటవలన వానిపీడ ప్రజలకుఁ దప్పును; వాని నెవ్వరును జంపకయే వాఁడుమృతినందును. కొందఱటుల మృతి నందుటలేదు; కాని వారిని బ్రజలే నిలువనిచ్చుటలేదు; వారు లోకులకు భయపడి న్యాయముగా రాజ్యముఁ జేయుచున్నారు; అట్లుచేయనివారు రాజ్యమును విడువవలసినవారగుచున్నారు; కొందఱు దమప్రాణములనే గోల్పోవుచున్నారు, కైకూబాదు మొదలయినవా రెంతకాలము రాజ్యమనుభవింపఁగలిగిరి? అసమంజసుఁడను రాజుయొక్క దౌర్జన్యమువలనఁ బ్రజ లాతని వెడలఁగొట్టిరని రామాయణమున (బాలకాండ 38 వ సర్గయందు) వర్ణింపఁబడియె. అటులనే వేనుఁడనువానిగతి శుక్రనీతిసారము మున్నగుగ్రంథములందు వక్కాణింపంబడినది. మఱియుఁ గౌటిల్యుని(చాణక్యుని) యర్థశాస్త్రమునఁ [I—6] గా మాదిగుణములకుఁ జిక్కికీడుఁ జెందినరాజులు కొందఱు పేర్కొనఁబడియున్నారు.

3. రాజకుటుంబములందు మర్యాదలు కొన్ని కాపాడఁబడుచు వచ్చుచున్నవి. సాహసౌదార్యాది గుణములును జనకుని వలనఁ బుత్రునందు సంక్రమించుచున్నవి. కావున వారి యాదర్శములుదారములై యుండును. వారిదృష్టినీచమైయుండదు. వారుతమప్రజలయభివృద్ధిఁజూచి యానందింపఁగలరు. అధ్యక్షుఁ డట్టివాఁడై యుండఁడు, వాఁడేనీచమైన వంశమునుండియూ వచ్చియుండుటచేతఁ గుత్సితకార్యము లొనరింపఁ జూచును. "దినమునకు రెండుపర్యాయములు భోజనమేల? మూఁడు దివములకొక్కసారి భుజంచినచో జనులు మృతినొందెదరా? కావున వారి రాఁబడి తగ్గునట్లు చేయవచ్చును; పన్నులను వృద్ధిచేయవచ్చును." అని యధ్యక్షుఁడు తలపోయుచుండును. వాఁడు వేనువంటివాఁడు వేనును

బెద్దఁజేసి శిరమునఁ దాల్చినచో నేమగును? మఱియు రాజునకున్న కళ
రాజునకుఁ గల వైభవము వేయిపర్యాయములు పుటశోధనంబుఁగావించి
నను నధ్యక్షునికి లభింపవు; రాజసభను విలోకింపుఁడు; అధ్యక్షునిసభను
గూడఁ జూడుఁడు; ఉభయుల నడకయందును నడతయందును గూడ భేద
మున్నది.

4. అధ్యక్షపదవికి వచ్చినవాఁడు పూర్వమొక సామాన్యమాన
వుఁడై యుండుటవలన నతనియందుఁ బ్రజలకంతగౌరవము కలుగదు.
అతనితో సమానులుగానుండి పనిచేసియున్న వారాతని నూత్నపదంబుఁ
జూచి సహింపఁ జాలరు. “ నిన్నటివఱకు మనతోఁ గలసి తిరిగిన
వాని కిప్పుడెట్టి యధికారము కలిగినది ! పిలచినను మాటాడఁడు ఏమి
యాతనిగర్వము!” అని వారు మనంబునఁ గుందుచు నాతనిపతనమునకు
సాధనములను బన్నుచుందురు. ఇఁక నాతనికంటెఁ బూర్వమున్నత
దశయందుండినవా రాతని నెట్లు పరిగణింపఁగలరో చెప్పనక్కఱలేదు.
ఇట్లు పాలకుని కినిఁ బాలితులకును మంచి భావము లేనప్పుడు పరి
పాలన మెట్లుండును? రాజు ప్రభువైనయెడల నిట్టి యవస్థ కలుగదు.
ఏలయన నతని యైశ్వర్యము మధ్యవచ్చినదికాదు; ఆతఁడాగర్భశ్రీమంతుఁ
డు; అబ్దశతములనుండి రాజ్యమనుభవించినవారి సంతతియం దుద్భవిం
చినవాఁడు, ఆతనికి నితరులకును గలభేదమాగంతుకముగాదు కావున
వారాతనియైశ్వర్య మాకస్మికమైనదని తలంపరు. భేదమునకు వా రలవ
డియున్నారు. మధ్యసంభవించిన లక్ష్మిగలవాఁడు కాఁడుగాన నతఁడంత
దుర్వినీతుఁడు కానోపఁడు. వారికిఁ గోపమును బుట్టింపఁడు. రాజకుటుం
బమునందావిర్భవించి రాజ్యాధికారమును సంపాదించిన రాజునందు జనుల
కు భయభక్తులుండునా? సమ్మతులై తిరిగి తిరిగి ప్రతినీచుని పాదములను
సేవించివచ్చి యధ్యక్షుఁడైన వానియం దవి కలుగునా?

5 ఎంతదుష్టుఁడైనను గుతంత్రముచేత నధ్యక్షుఁడు కాఁగలఁడు; అందువలన లోకములకుహానికలుగఁగలదు. రాజత్వమన్ననో, పుణ్యావశమున నారసత్వముచేత నెవ్వనికో ప్రాప్తించునది. అతివినయము నభినయించి ధర్మధ్వజిత్వము నవలంబించి ధనమును వర్షించి, హృదయములాకర్షించి, యధ్యక్షత్వమును సంపాదించి, లోకమునకు ద్రోహమొదవించు ధూర్తుల కధ్యక్షపద్ధతి మిక్కిలి యవకాశమొసంగుచున్నది. ఇది లంచములిచ్చుట మనిషిమొద్దమనిషి మాటమాటాడుట, ప్రతికూలురను బెదరించుట, మున్నగు పాపకార్యములను జేయించుచున్నది. జీతమయినను లేనట్టియధికారములకై పెనఁగులాడువారిస్థితి యిట్లుండ రాజును ద్రోసిరాజనెడు దేశాధ్యక్షపదంబునకై ప్రయత్నించు వారిమాట నుడువనక్కఱలేదు, కావున దుష్టులు పెద్దపరీక్షలం దెట్టులనో యుత్తీర్ణులయ్యుఁగఁడు నింద్యములయిన కార్యములను జేసియు నధ్యక్షులై ప్రజలను బీడించుట సంభవించును. ప్రజల నీతికూడఁజెడిపోవుచున్నది.

6 రాజులపరిపాలన మధ్యక్షులపరిపాలనముకంటె స్థిరతరమయినది. ఒక్కవంశమే వందలకొలఁదివత్సరములు రాజ్యమనుభవించుట కలదు; మధ్యను విప్లవములులేవు; రాజు చనిపోయినతోడనే యాతని కొమరుండు సింహాసనమునెక్కి ప్రజల కెట్టియాపదయు వాటిల్లకుండునట్లు చేయుచువచ్చెను కాని యొక్కయధ్యక్షునిసమయమందే లెక్కలేని విప్లవములు సంభవించి రక్తస్రావము కలుగుచున్నది. పోర్చుగల్ [బుడుతకీసులదేశము] పశ్చిమఖండమున నున్నది. అచ్చటఁ బూర్వము రాజులే పరిపాలించుచుండిరి. కాని కొంతకాలమునకు రాజును లాగివైచి ప్రజలలోఁ గొందఱు విధానమును మార్చి యధ్యక్షుని నియమించిరి; వానిని మరలఁ దీసివేయఁ బ్రయత్నించిరి. ప్రజలలో యుద్ధములు ప్రారంభమై దేశమరాజకమైనది. క్రొత్తగా నొకయధ్యక్షుఁడు వచ్చుచుండును; కాలము ముగియుటకుఁ బూర్వమే యాతనికిఁ గాలమువచ్చుచుండును. అమెరికాయందు మెక్సికోయనుదేశము గలదు; అచ్చటఁ

పుత్త్రుఁడు కూడ నెంత కష్టపడినవాఁడయియున్నను నతనిప్రజలు కృతఘ్నులైయాతనిని వధించి వంశవిచ్ఛేదముఁ గావించిరి. అట్లుచేసినవారిపు డేమి ఘనతఁగాంచిరి? వారు సస్యాదిఫల మనుభవించుట లేదుగాని యుద్ధాంతఫల మనుభవించుచున్నారు. జనులందఱును సమానులఁట కాబట్టి యందఱిపనియు మట్టమయినది. ఒక్కరికిని సరిగాఁ దిండియు బట్టయును లేవు. రవీంద్రనాథటాగూరుగారు రష్యాయందు బాధపడుచున్న విద్వాంసులమనవి నాలకించి వారికి మనదేశమునుండి సొమ్మునుబంపుట కిప్పుడు ప్రయత్నించుచున్నారు. ఎంతదౌర్భాగ్యముగలవారో గాకున్న మిక్కిలి విషమమయిన సమయమునఁ దమనాయకులయిన చక్రవర్తులను జర్మని రష్యా మొదలయిన దేశములందలి ప్రజలు పరాభవించి పరిత్యజించియుండరుగదా? ఇంగ్లాండునందును గొందఱు విప్లవమునకై కూతపెట్టియుండిరి. కాని, వారిని దొరతనమువారు పట్టుకొనుటకుఁ బ్రయత్నింప, రాజునకధికారము మిక్కిలి తక్కువగాఁగల యింగ్లాండునందువిప్లవ ముద్దేశింపఁబడలేదనియునిట్టిపద్ధతి లేని యితర దేశములన్నిటియందుమాత్రమే యదియభిమతమయినదనియుఁ జెప్పి వారు తప్పించుకొనిరి. ఇంగ్లాండు నందలిప్రజలు ప్రాయికముగాఁ బూర్వ సంప్రదాయములం దభినివేశముఁగల్గి జాగరూకతతో మెల్లగా ముందునకడుగులిడువారు (From precident to Precident) గావునవారుఫ్రాంసున సంభవించిన విప్లవముయొక్క వేగమునకు నిలువఁగల్గి యితర దేశములనేకసమయములందుఁ దలక్రిందగుచువచ్చుచున్నను దామమాత్రము కంపమునొందక సురక్షితముగానున్నారు. ప్రభువర్గము (House of Lords) నిరస్తమగువఱకు నింగ్లాడునకపాయము కలుగదు. కూలివాండ్రు మొదలయినవారితో నిండిన సామాన్యవర్గము (House of commons ) ప్రబలమయినచో నింగ్లాడునకు ముప్పువాటిల్లును. అధ్యక్షపద్ధతివలన మాటిమాటికి మార్పులు కలుగుచుండునుగాన శాంతి నభిలషించువారు రాజునే స్వీకరింపవలయును.

గోవిందరాజు హరిశ్చంద్రరావు. కాకినాడ.

# కవిత్వము.

కవిత్వమననేమి. అందువలన ప్రపంచమునకు గలలాభమేమి. కవి యొక్క విధాయకమేమి. సంఘమునందుకవి యెట్టిస్థానము నలంకరించు చున్నాడు. బంధకవనము, ఆశువు, అవధానములు మొదలగునవి ప్రపంచమున కెంతవరకుపచరించుచున్నవి? మనపూర్వులు కవిత్వము నేర్చుచుటలో వారియుద్దేశ్యమేమి. కేవల వినోదార్థమా లేక దానివలన లోకమునకు స్థిరమగునుపకారము గలుగవలయుననియా? ఇందు పద్యకవనము గద్యకవనము, మృదుమధుర పదలలితమగుకవనము, నిఘంటుసహాయ్యము నన్నైన నర్థముగాని యసాధారణ కఠినపద దీర్ఘసమాస భూయిష్ఠమగు కవనము, వీనియందధిక ప్రయోజన కరములగునవి యెవ్వి. ప్రబంధములు, దృశ్యప్రబంధములు మొదలగువాని ప్రయోజన మెట్టిది? దృశ్య ప్రబంధములకును రాగతాళాదులగు సంగీతభేదములకును సంబంధ మావశ్యకమా. అట్టిసంబంధమువలన గలుగులాభమేమి. లేకున్నఁ గలుగునష్టమేమి యనునంశములు అలోచింపఁబడఁదగినవి,

కవిత్వము. భగవచ్ఛక్తి నీతిబోధకము, దుర్నీతినివారకము, మహాదాహ్లాదసంధాయకము, సర్వదుఃఖసంహారకము, అతిశయశాంతిప్రదము. ఇట్టికవిత్వమును విరించి వాల్మీకి మహర్షికి దుష్టశిక్షణాయుధముగ ననుగ్రహించెను శ్రీమద్రామాయణ గ్రంధరచనా మహాత్కార్య సాఫల్యమునకొసంగెను. సర్వసంగపరిత్యాగియు దివ్యతేజోధనుడును, ఘోరతపశ్చరణ పూతాంతరంగుండును, నిరంతర శ్రీరామనామజపితయునగుమహాయోగి వాల్మీకిమహర్షి, అట్టితపోధనుడు కవిత్వమును స్వీకరింప నర్హపాత్రమని చతుర్ముఖుడతనికి ప్రసాదించెను. ఎట్టిప్రాణికినిగూడ నపకారము చేయక తృణాంకురములనుదిని నెలయేటినీండ్లన్ద్రావిజీవించుచునసాధువులగు వారిణమిధునము విహారగోష్ఠినుండ నిష్కారణుడై

యుండెనొక్క దానిని తననిశితనారాచము పాలొనరించిన క్రూరనిషాదుని దుష్కార్యావలోకనసంజనితమగు వ్యాగ్రహమువలన ఛందోబద్ధమగునొకశ్లోకమా మహర్షి పుంగవుని ముఖంబున వెలువడినది. దైవ ప్రసాదితమగు నాకవిత్వము నామహనీయుడెట్లు వినియోగించెను ఆత్మశ్లాఘనంబునను పరదూషణంబునను మానినీరహస్యావయవ వర్ణనంబునందునను సంభోగవర్ణనంబునను నాతడు వినియోగించెనా? లేదు. పరమపవిత్రమగు శ్రీరామకథావర్ణనమునందు రామాయణగ్రంథ నిర్మాణమునందు వినియోగించి తనజన్మమును సార్థకమొనరించుకొనెను. తొల్లిటి కవీశ్వరులన్న రాజాధిరాజులుగూడ భయపడుచుండిరననేమి? ఆకవివరులు నిర్భయముగ నన్యాయమునుఖండించుచుండిరనుటయేగదా. అప్పటికవులు శాపానుగ్రహసమర్థు లగుటచే వారికంతటిగౌరవము వచ్చెననుకొందము. శాపానుగ్రహసమర్థులన నేమి? అది తపస్విని వారనుటయేగదా. తపశ్శాలురనుటయేగదా. సత్పథగాములనుటయేగదా. అట్టిమహానుభావులగువారు భగవద్దత్తమగుకవిత్వమును భగవద్గుణానువర్ణనమునందును న్యాయధర్మవివరణము నందు వినియోగించి లోకోపకార మొనరించిరి. కవిత్వము బోగము మేళమువలె, బాణసంచా కాల్పుడువలె, విందుభోజనమువలె తాత్కాలిక సౌఖ్యప్రదమగు వినోదముగాక లోకోపకార్యకరణ సమర్థమగు స్థిరవిద్య. అట్టిధర్మములననుసరించి ప్రవర్తించుట కవకాశముకలుగుటయే లోకమునకు కవిత్వమువలనగలుగులాభము. అట్టివిద్యుక్తధర్మమును సక్రమముగ నడుపువాడేకవి. అదియే యతనివిధాయకము. అట్టివిధాయకమునునడుపునుకవి, సంఘమున కుపదేశకు డగుచున్నాడు. పొడిమాటలువినుటకన్న కట్టుబాటుగలిగిన గద్యమునువిన నిష్టముండును. గద్యమును జ్ఞాపకముంచుకొనుటకన్న ఛందోబద్ధమగు పద్యమును జ్ఞాపకముంచుకొనుట సుకరము. కఠినపదములను దీర్ఘసమాసములనుప్రయోగించుటవలన జన

సామాన్యమునకు ప్రయోజనము లేదు. కావుననే కాళిదాసాదులు దృశ్యప్రబంధములయందు వచనమును బోలినడచునట్టి యనుష్టుప్ శ్లోకములనేవాడియున్నారు. నీతినిబోధించుటలో ఎప్పుడో జరిగినదానిని, వర్ణించునది ప్రబంధము. జరిగినదిజరిగి నట్లుమన కనులయెదుటచూపించునది దృశ్యప్రబంధము. ప్రత్యక్షముగచూచుటవలన మనస్సు త్వరగ గ్రహించగలుగును. కాని దృశ్యప్రబంధములు మృదు మధుర పదమిళితములునునీతియుతములునుగ నుండవలెను. అట్లుండినంగాని భావప్రకటన కెంతమాత్రమవకాశముండదు. నాటకమునకు బ్రధానము భావప్రకటనము లేక రసపోషణము. నటుడు తానే పాత్రభాగమును ప్రదర్శించుచున్నాడో ఆపాత్రకనుగుణ్యమగు రసపోషణమును - తా ననుభవింపడేని ఇతరుని ననుభవింపజేయ లేడు. లేనిచో నిష్ప్రయోజనము. దానిపేరే రక్తికట్టకపోవుట ఇప్పుడు ప్రధానమగు నీరసప్రకటన ముప్రధానమై అప్రధానమగు సంగీతము ప్రధానమగుచున్నది. చదివెడుపద్యమర్థముకాకుండ అక్షరమక్షరమునకు సంగీతము. రాగాలాపనము. సంగతులు-పల్టీలు. వచనభాగముమ్రింగివేయుట-లేక పారమేకరుపుబెట్టుట.

క్రమముగ పద్యము లంతరించుచున్నవి. వచన మసలే లేదు. పాటలు, మృదంగము, తాళము, వెనుకపాట, హార్మొనిపాట, నడుమ నడుమ మేళములో గజ్జకట్టిన వేశ్యాంగనవలె నటుని నోట సగము సగముమాట-ఇక రసపోషణము నకును భావప్రకటనమునకును కొదువయేమి ఎన్ని పల్టీల నెక్కువ గొట్టిన - నెన్ని సంగతుల నెక్కువ వేసిన న త డం త ప్ర వీ ణు డ గు న ట శే ఖ రుం డు (Best Actor) ఇట్లు పరిణమించినది. అందుకుతగినట్లు తాళమున కనుకూలములగు వృత్తముల వ్రాయువారు కొందరు. కీర్తనలనే వ్రాయువారు మరికొందరు. అట్టి కీర్తనలు లేని దృశ్యప్రబంధము చెత్త. తాళమునకు సంబం

ధము లేని గీతములును సీసములును గల నాటకము అబ్బెబ్బె. ఇట్లున్నది.
మొదట దృశ్యప్రబంధనిర్మాతల సంకల్పమేమో. ఇప్పటి పరిణామ
మెట్లున్నదో చదువరులూహింపదగును. కొందరు బుద్ధిమంతులు తమ
గ్రంథములలోఁ బాటలు దృశ్యప్రబంధముల కప్రస్తుతము లయినను
కాలానుగుణ్యముగ విధిలేక వ్రాసితిమని తమయుపోద్ఘాతములలో వ్రా
యుచున్నారు. కవిపుంగవులు తమకప్రస్తుతమని తోచిన యంశములకు
సహకారులగుట మిక్కిలి శోచనీయము. ఇది యిటులుండనీక బంధక
వనము, ఆశుకవనము, అవధానము మొదలగువాని యుపయోగ మేమో
చదువరు లూహింపుడు. ఒకపండితుఁ డొక శ్లోకమునే 100 శ్లోకము
లుగ చదువునట్లు వ్రాసెను. ఆయొక్క శ్లోకమునకే 200 అర్ధములుగలవు.
ఇంతయు నొక్క చక్రములో నిమిడియున్నది. దీనినివ్రాయుటకు 12 నెలలు
పట్టినది. దీనిని మరల నాతడేవిప్పి చెప్పవలెనుగాని పండితులకయిన విడి
పోదు. ఎంతజనోపయోగమో యూహింపుడు. వర్షధార-గోదావరివరద-
గంటకు 900 పద్యములు. మహాప్రవాహము- వినిరి-ఆనందించిరి- బహు
మతుల నిచ్చిరి - పొల్లు-కవిత్వము రసవంతమైన నేమి. కాకున్న నేమి.
వ్యాకరణదోషములున్న నేమి. లేకున్న నేమి. ఒక్కపద్యముగాదు అరప
ద్యముగాదు పద్యపాదమయిన లేదు. ఉన్నదనుకొనుఁడు ప్రయోజనము
లేదు. జనోపయోగము లేదు. సహస్రఘంటకవనము. వెయ్యి శ్లోకము
లు వెయ్యిమందికి ఒక్కొక్క చరణము చెప్పి మరల రెండవది= మూ
డవది-నాల్గవది-అడగగూడదు-ఊఁ, అనగూడదు- సీసగర్భకందములు-
పద్యములో పద్యము. దుష్కరప్రాసములు- చివరకు నన్నియును చదు
వవలెను. మూడుచరణములైనవి. అవధానిగారికి తలదిరిగినది క్రిందపడి
పోయిరి. మంచుగడ్డ దలకుకట్టిరి. అందొక డాక్టరుగారు. పాపమువీరికి
(Hard work to Brain) మెదడునకు శ్రమ యెక్కువ యైనదనిరి. ద్రా
మ్మరిసాని గడ్డపై కెక్కి మొగ్గలు వేసినది. చూచువారు సంతసించిరి.
అహాహా ఎంతకష్టమండిఅనిరి. అంతకన్న నీశతావధానమందష్టావధానమం
దేమి విశేషమున్నదో జనోపయోగమున్నదో చదువరులూహింపుడు.

# దు ర్గా స్త వ ము.

( ఏప్రియల్ సంచిక తరువాయి )

మ॥ జగముల్ శుంభనిశుంభఘోరతర దోస్సారప్రభావమ్మునన్
విగతప్రాభవమై భయార్తమగుచున్ బెంపెల్లఁ గోల్పోయియుం
డఁగ నృపన్ లోకహితార్థమై యసురదుష్టద్వంద్వమున్ గూల్చి యా
యుగచాట్లన్నియుఁ బాపినావుగద దుర్గా! భక్తసంరక్షిణీ॥ 27

మ॥ సిరియున్ భారతియున్ బ్రసన్నమతినిన్ సేవించుచుండంగ బం
గరుసింహాసన మందునన్ నిలిచి శత్రూదతుమా శక్తివి
స్తరణంబున్ బ్రకటించి లోకముల దీక్షన్ బ్రోచునీ ప్రజ్ఞ శం
కరుఁడేనిన్ గనఁజాలునే తలఁప దుర్గా! భక్తసంరక్షిణీ॥ 28

మ॥ నలుగింబిండిని బొమ్మఁగా సలిపి ప్రాణంబిచ్చి యామీఁద మం
జులపాండిత్యఘునిన్ బొనర్చి యటుపై శుంభస్మహావిఘ్నపా
ళులకున్ ద్రేనిగఁ జేసి యంతట దయాలోకాతిశాయిప్రభా
కలితాత్మప్రకృతిన్ రచించితివి, దుర్గా! భక్తసంరక్షిణీ॥ 29

మ॥ ధరణీస్థైర్యము నంబురాశి భవదుద్యత్పావనత్వంబు, దు
ర్భరవహ్నిద్యుతి నీప్రతాపము, జగత్ప్రాణుండు నిపాల నా
దరమున్ వ్యోమతలంబు నీదగు విభుత్వంబున్ నిరూపించుచున్
గరమాశ్చర్యముఁ గల్గఁ జేసెడిని దుర్గా! భక్తసంరక్షిణీ॥ 30

మ॥ అరయన్ భూతములైదుఁగూడ భవదీయాస్తోకమాహాత్మ్యము
ద్ధరతన్ జాటుచునుండ లోకములయందుం గల్గు జీవాళిలో
నురు పాపౌఘతమోపహంబగు భవజ్జ్యోతిస్స్వరూపమ్ము ని
క్కురుఁడేనిన్ గనఁజాలునే మదిని దుర్గా! భక్త సంరక్షిణీ॥ 31

శా॥ కేలన్ శూలముఁబూని శాత్రవుల నక్షీణప్రభావమ్మునన్
గూలంద్రోచి జగత్త్రయిన్ గలుగు సంక్షోభమ్ము వారించి హే

(౯)

వినోదమనుచున్నారా ఎంత యాయాసపడి గురుకులవాసము జేసి విద్య నభ్యసించి విద్వాంసులై పండితపూజ్యులగు మహానుభావులు తమపాండిత్యము నెరిఁగియు సృష్టిబంధనములు, నాశువులు, అవధానములు నొనరించి వ్యర్థము నొనర్చుచుండక నీతిబోధకములగు సద్గ్రంథముల రచియించి లోకోపకార మొనరించి తమకీర్తి నేల యాచంద్రార్కము నొనరింపరాదు ఇప్పుడు ఎన్నియో గ్రంథములు కాలానుగుణ్యముగ నత్యవసరముగ వ్రాయబడవలసియున్నవి ఎన్నియో శాస్త్రము లావశ్యకములుగనున్నవి విజ్ఞానచంద్రికాగ్రంథమండలివారు ఆంధ్రభాషాభివర్ధనీసమాజమువారు ఆంధ్రపరిషద్దమువారు ఆంధ్రప్రచారిణీవారు మఱియు నెందరో నీమహాత్కార్య భారమును బూనియున్నారు. ఇంకను గావలెను గావలెనని ఘోషించుచున్నారు. మహారాజు లెందరో భాషాభివృద్ధికి తోడ్పడుచున్నారు. అట్టిచో సహజపాండిత్య భూషితులగు మనీషులు వారికేల బాసటగారాదు తమ పాండిత్యము నంతయు నీ వట్టివినోదముల పాలుచేసి వారు గొప్పవారని కొందరు వీరు గొప్పవారని కొందరు లేనిపోని కుతంత్రములు పన్ని తగవులు బెంప నిష్ఫలపద్యవాదములతో కాలక్షేపము చేయుచు వీరు మతవిద్యుక్తమును నిర్వహింపలేమను సంతోషమును శాంతిని బడయఁగలరా ధనవంతుఁడు తనధనమును సత్కార్యములయందు వినియోగించిన బూజ్యుఁడగును దుష్కార్యములయందు వినియోగించిన నింద్యుఁడగును తాను దినక యేకార్యమునకును వినియోగింపక వాఁడు పరిత్యజింప బడును వాఁడు ధనికుఁడయ్యును ధనహీనునికన్న నధముఁడగుచున్నాఁడు అట్లే పాండిత్యమును కవిత్వమును సంపాదించి దాని నందులకు వినియోగింపక గ్రంథములను వ్రాయక శిష్యులకు బోధించిన విద్యత్తగిపోవునని తలంచు విద్వన్మాన్యులు పరిహాసపాత్రులగుదురు. తమ పాండిత్యమును సార్థక మొనరింపక యే వట్టిమొట్టివాదముల ప్రొద్దుపుచ్చు వారు మెప్పును బడయలేరు ప్రస్తుతకాలానుగుణ్యముగ లోకోపకారకములగు గ్రంథములను వ్రాయువారు సర్వలోకపూజ్యులగుచున్నారు గాన కవిపుంగవులు తమ విధాయకమును భంగ మొనరింపవలదని ప్రార్థించుచున్నాము.

రాశింబౌ భవదీయ సత్కృపను నిర్వ్యాజమ్ముగాఁ జూపి లో
కాళిన్ రక్షసేయునర్చినావుకద దుర్గా! భక్తసంరక్షిణీ॥ 32

శా॥ కామక్రోధము లాదిగాఁగల మహాగంభీర రోగంబులు
ద్దామాకారముతోడఁ జుట్టుకొనినన్ ధైర్యంబునన్ నీ లస
న్నామంబున్ మదినెంచినంతనె జనుల్ త్రాణన్ వడిన్ వీడి యా
హా! మాహాత్మ్యము నెన్ననీదెకద? దుర్గా! భక్తసంరక్షిణీ॥ 33

మ॥ అల కాశీపురమందు నెల్లరకు మృష్టాన్నప్రదానంబు ని
స్తులరీతిన్ బొనరించుచున్ భవున కెంతో మోదమున్ గూర్చుచున్
గలుషధ్వంసినియౌ సురాపగను విఖ్యాతిన్ దిగంద్రోచు నీ
యలసామర్థ్యము నెన్నఁగాఁదరమె? దుర్గా! భక్తసంరక్షిణీ॥ 34

శా॥ నీ మాయామహిమంబుచేత నెకదా? నీరేజపత్రాక్షుఁడీ
భూమిన్ బల్మరు పెక్కురూపముల సమ్మోదంబునన్ గాంచి, యు
ద్దామాకారుల లోకకంటకుల నుద్యల్లీలఁ జెండాడి యా
త్మౌఘాతన్ సుఖియింపఁ జేయుటలు దుర్గా! భక్తసంరక్షిణీ॥ 35

మ॥ భువనోద్భూత చరాచరాత్మకముల్ బొల్పారవీక్షించినన్
భవదీయాంచిత సత్కళాకలనయే భాసిల్లుచుండంగ, నే
యవివేకాంధునకేని నీమహిమ దివ్యంబౌచుఁ గన్పట్టి యా
రవురా యంచనిపింపదే తలఁప దుర్గా! భక్తసంరక్షిణీ॥ 36

మ॥ చండారాతిశిరోవిదారణపటిష్ఠస్ఫారవిఖ్యాతకో
దండాభీలుఁడు రామచంద్రుఁడునినున్ "దల్లీభవచ్ఛక్తియు
ద్దండం" బంచు వచించి భక్తిమెయినిత్యంబాత్మఁబూజింప నే
గండంబైననునిన్నుఁ గొల్వఁడొకో? దుర్గా! భక్తసంరక్షిణీ॥ 37

మ॥ నానాయోగి మునీంద్ర హృత్పుటలసన్నాళీక భృంగీ! భవ
న్నానాపుణ్యచరిత్ర పాఠములు నానందప్రదంబౌచుమో
దానందంబును గూర్చి లోకుల కనన్యశ్రీ విశేషంబులౌ
రా! నిత్యంబుఘటిల్లఁ జేసెడును దుర్గా! భక్తసంరక్షిణీ॥ 38

తగలదు. మన దేహమునుబూజించిన సంతోషమును దూషించిన గోధ మును దేహాభిమానియగు జీవుని కెటులఁగలుగుచున్నదో యటులనే పృథి వ్యభిమానదేవతకుఁగూడఁ బూజవలన నను గ్రహముగలుగునుగానఁ బృథివీ ధ్యానము చేయఁదగియున్నది. ఇంతకుఁ బ్రతిమనుజుఁడు సూర్యోదయా నకుఁ బూర్వమందు నాలుగుగడియల ప్రొద్దుండఁగా లేచి మొదట నిష్ట దేవతా ప్రార్థనచేసి తరువాతఁ బైనఁజెప్పినశ్లోకముచేఁ బృథివీధ్యానము చేయఁదగినదని చెప్పఁబడినది. ఇవి యెల్లరకుఁ గొంచె మోపికగలిగి యుండిన సులభముగా నాచరింపఁదగియున్నవి. ఇటుల మన పెద్దల యా చారముగలదు. ఇటుల నిష్టదేవతాప్రార్థనయుఁ బృథివీప్రార్థనయుఁ జేసి మంగళవస్తు దర్శనము చేయఁదగినది.

శ్లో॥ శ్రోత్రియం సుభగాం గాంచ హ్యగ్ని మగ్నిచితం తథా, ప్రాతరు త్థాయ యఃపశ్యే త్ఆపద్భ్య స్సప్రముచ్యతే॥ ప్రాతఃకాలమందు సాంగ వేదాధ్యయనతత్కర్మానుష్ఠానపరుఁడగు బ్రాహ్మణునిగాని మంచిగుణములు గల గోవునుగాని యగ్ని హోత్రమునుగాని యగ్నిగల గుండమునుగాని మొట్టమొదటఁ బ్రతిదినమందును జూడఁదగినది. ఈ పవిత్రమగువస్తువు లను జూచుటవలన సర్వపాపములును బోయి పవిత్రుఁడగునని యీ శ్లోకము చెప్పుచున్నది. అపవిత్రవస్తుదర్శనము ప్రథమము చేయఁగూ డదు. దానివలన మన కపవిత్రత సంభవించునుగాన మంగళవస్తుదర్శ నము ప్రప్రథమమునఁ జేయఁదగినది. తరువాత మలమూత్రోత్సర్జన శౌచాదులు శాస్త్రప్రకారముగాఁ జేయవలెను. మూత్రపురీషోత్సర్జన కాలమందు యజ్ఞోపవీతమును నివీతిగా వెనుక భాగమందుఁ గాని కర్ణ మందుఁగాని యుంచి శిరస్సునందు వస్త్రమును గప్పుకొని యితరదిక్కులు చూడకుండ ఘ్రాణేంద్రియమును బంధించి తృణావృతభూమియందు మూ త్రపురీషోత్సర్జనము చేయఁదగినది. పగటియందును సంధ్యాకాలములం

ధను నుత్తరాభిముఖుఁడై రాత్రియందు దక్షిణాభిముఖుఁడై చేయఁదగినది. మార్గమందుఁగాని నదీతీరమందుఁగాని మలమూత్రాదులు వదలఁగూడదు. శ్లో॥ హస్తాన్ ద్వాదశ సంత్యజ్య మూత్రంకుర్యాత్ జలాశయాత్, అవకాశే షోడశవా పురీషేతు చతుర్గుణం॥ జలముండుచోటికిఁ బదిరెండుగజముల దూరమునఁగాని యవకాశముండినఁ బదియారుగజముల దూరమునఁగాని మూత్రోత్సర్జన చేయఁదగినది. దీనికి నాలుగురెట్లధిక దూరముగాఁ బురీషోత్సర్జనచేయఁదగినది. మూత్రోత్సర్జనాదులయందు మృత్తికాశౌచము చేయవలెను. త్రివారము లామలకప్రమాణ శుద్ధదేశ మృత్తికతో శౌచముచేయఁదగినది. పురీషస్థానమందుఁగూడ నటులనే మృత్తికాశౌచము చేయవలెను.

శ్లో॥ మూత్రేతు ద్విగుణం శుక్రే మైథునే త్రిగుణంస్మృతం పురీషే త్వేకలింగేచ గుదే త్రిస్సప్తవాతథా। ఉభయోఃకరయోస్సప్త సప్తత్రిర్వాపిపాదయోః। ద్విగుణం బ్రహ్మచర్యేస్యా ద్యతీనాంచ చతుర్గుణం। ఏవం మృద్భిర్జలైశ్శౌచం తదర్ధం నిశికీర్తితం। తదర్ధమాతురే శూద్రస్త్రీబాలానాం తదర్ధతః॥ ఇత్యాదిరీతిగా శౌచవిధి గలిగి యుండఁదగినది. మూత్రోత్సర్జనకు నాలుగుసారులును బురీషోత్సర్జన కెనిమిది సారులును భోజనమందుఁ బదిరెండుసారులును జలముతో గండూషము చేయఁదగినది. ఈశౌచాదులవలవ శరీరశుద్ధియు మనశ్శుద్ధియుఁ గలుగును. శౌచహీనుఁ డపవిత్రుఁడై జ్ఞానవైరాగ్యాది హీనుఁడగును. కావున శరీరశుద్ధి కంతశ్శుద్ధినిగోరి శౌచముగలవాఁడై యుండఁదగినది. శౌచము లేనియెడలఁ బ్రత్యవాయముగలదనికూడఁ జెప్పఁబడినది. హారీత స్మృతి. శ్లో॥ త్యక్తశౌచం నరం దృష్ట్వా ప్రహసంతిహా రాక్షసాః। యక్షాః పిశాచా భూతాని యేచాన్యే దుష్టచారిణః। స్నానం దానం తథా ధ్యానం మంత్రకర్మ విధిక్రియాః। మంగళాచారశాస్త్రాణి శౌచభ్ర

ష్టస్య నిష్ఫలాః॥ శౌచహీనుఁడగు జనునిఁజూచి రాక్షసులు భూతములు పిశాచములు మొదలగు దుష్టులు పరిహసింతురనియు శౌచహీనుఁడై చేసిన స్నానము దానము ధ్యానము మంత్రజపము కర్మము మొదలగు నవి నిష్ఫలములగుననియు నీశ్లోకముల యర్థము. శౌచహీనుని బిశాచ రాక్షసాదులు పరిభవించి స్నానదానాదుల వలనఁ గలిగెడు ఫలమును జెఱుతురు. శ్లో॥ శుచిం దేవాశ్చ రక్షంతి రక్షంతి పితరశ్శుచిం। శుచేర్బిభ్యంతిరక్షాంసి యేచాన్యే దుష్టచారిణః॥ శౌచముగలవానిని దేవతలును బితృదేవతలును రక్షింతురు. రాక్షసపిశాచాదులు శుచిగలవానిని జూచి భయపడుదురని దీనియర్థము.

దీనివలన శుచిగలిగియున్నదైవానుగ్రహపాత్రుఁడును బిశాచాది దుష్టులకు భయంకరుఁడును నయినవాఁడై ధర్మసంపాదకుఁడగును. హస్తపాదప్రక్షాళనానంతర మాచమనము చేయఁదగినది. శ్లో॥ కృత్వాథ శౌచం ప్రక్షాళ్యపాదౌ హస్తౌచ మృజ్జలైః కృతోపవీతస్సవ్యాంసే వాగ్జనః కాయసంయుతః, నిబద్ధశిఖకచ్ఛస్తు ద్విజ ఆచమనంచరేత్, అంతర్జాను శ్శుచౌదేశే ఉపవిష్ట ఉదఙ్ముఖః, ప్రాగ్వా బ్రాహ్మణతీర్థేన ద్విజో నిత్య ముపస్పృశేత్॥ శౌచమైన తర్వాతఁ బాదప్రక్షాళనము హస్తప్రక్షాళనముఁ జేసి యజ్ఞోపవీతము నుపవీతిగాఁ జేసికొని మాటలాడకుండ శరీరము కదలకుండ నితరమనస్కుఁడుగాక జుట్టు ముడివైచుకొని బద్ధకచ్ఛుఁడై మోకాళ్లలోఁగాఁజేతులుంచుకొని బ్రహ్మతీర్థమునుండి యాచమనము చేయఁదగినది. బ్రహ్మతీర్థమనఁగా నంగుష్ఠమూలమునఁ బెద్దరేఖ పుట్టినస్థానము. ఆస్థానము నుండి యాచమనము చేయఁదగినది. శ్లో॥ గోకర్ణాకృతి హస్తేన మాషమాత్రజలంపిబేత్, తన్న్యూనమధికంవాపి సురాపానసమంభవేత్॥ ఆవుయొక్క చెవివలె హస్తమును జేసి దానియందు మినుపగింజ మునుఁగునంత జలముతీసికొని పుచ్చుకొనఁదగినది.

అంత కెక్కువగాఁగాని తక్కువగాఁగాని పుచ్చుకొన్నయెడల మద్యపానము తో సమానమగునని దీనియభిప్రాయము. దీనివలన మినుపగింజ మునుఁగు నంతజలముతీసికొని గోకర్ణాకృతిగల హస్తముతో సంగుష్ఠమూలముగా నాచమనముచేయవలెనని తెలియుచున్నది. శ్లో॥ హృత్కంఠతాలుకాభిస్తు యథాసంఖ్యం ద్విజాతయః, శుధ్యేరన్ స్త్రీచశూద్రశ్చసకృత్స్పృష్టాభిరంతతః॥ బ్రాహ్మణుఁ డాచమనోదకమును నాభికిఁ బైగాఁ హృదయమువఱకు వ్యాపించునట్లుగాను క్షత్రియుఁడు కంఠపర్యంతము వ్యాపించునట్లుగాను వైశ్యుఁడు తాలుప్రదేశము (దవుడ) వఱకు వ్యాపించు నట్లుగాను జేయఁదగినదనియు స్త్రీశూద్రులొకమాఱు తాలువులకుఁ దగులునట్లుగను నాచమనము చేయఁదగినదనియు నభిప్రాయము. శ్లో॥ పక్వం సఫేనం కలుషం దుర్గంధంచ సబుద్బుదం, ఉష్ణం సమృత్తికాక్షారం త్యజే దాచమనేజలం॥ ఉడికిననీళ్ళను నురుసుగలనీళ్లను గలుషితమైననీళ్ళను దుర్గంధముగలవియు బుగ్గలుగలవియు వేఁడిగలవియు మట్టిగలవియు నుప్పువియు నైననీటితో నాచమనము చేయఁగూడదు.



# నాగరఖండము.

## — తృతీయాశ్వాసము —

క॥ అత్రేయకామమునివరగోత్రాలంకారభూష! గురుజనకరుణా-
పాత్ర! పవిత్రచరిత్ర! త్రిణేత్రపదాబ్జాతయుగళనిష్ఠితచరణా! ౧

## — భ్రూణగర్తామాహాత్మ్యము. —

వ॥ అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునులంగూర్చి "విపులాకారయుక్త్వపాతకనాశకంబు నగు భ్రూణగర్తం బాప్రదేశంబునను విలాజిల్లెడి, నందు సౌదాసభూపతి బ్రహ్మహత్యనుండియు సుషేణమహీపతి స్త్రీహత్యనుండియు విముక్తులైరి" యని వచించుటయును నమ్మహర్షులు. ౨

ఆ॥ "బ్రహ్మహత్య యేల ప్రాప్తించె నతనికిఁ? బ్రథమ మెందుకరయ్యె బ్రహ్మహంత?
భ్రూణగర్త మెటులఁ బోఁగొట్టె నద్దాని? గర్త మేరుపడినకథ మదెద్ది?" ౩

వ॥ అనియిట్లు ప్రశ్నించుటయును సూతుండిట్లనియె, "దేవదేవుండగు శూలి యెప్పుడు లింగపాతంబయ్యెనో యప్పు డతండు లజ్జావిష్టుండై పెద్ద గర్తం బొకడు త్రవ్వుకొని యవ్వివరంబు గావరాపుండున ట్లందుఁ బ్రవేశించియుండె, నీవిధంబున నం దాగర్తం బేరుపడినయది, దాన సౌదాసభూపతి పాతకహతుం డెటులయ్యెనో యదియును వచించెద వినుండు. ౪

క॥ వరఁగను మిత్రసహుండను ధరణీపతి రవికులమునఁ, దద్ధార్మిక భూ
వరునకు సౌదాసుండను సురుచిరగుణుఁడైనయొక్క సూనుండుండెన్, ౫

చం॥ అతఁడు సువర్ణదక్షిణము లైనమఖంబు లనేకము ల్పను
ష్ఠితి నొనరించి బ్రాహ్మణజనంబుల నెన్న నశక్యమౌ విహా

పితములఁ దృప్తులం జలిపి పెట్టెను ద్వాదశవార్షికంపు స
త్క్రతువొక డాగమోక్తమగు కర్తయుతోడ నొకప్పు, డయ్యెడన్ ౬

శా॥ క్రూరాత్ముండును క్రూరబుద్ధియును రక్షోనాయకద్వంద్వ మిం
ద్రారు ల్యాతములుం బిశాచములు సాహాయ్యంబుగా వింప న
ట్లారబ్ధంబయి సాగుచున్న మఖమం దత్యల్పహాభిద్రి మే
ద్రోరాఁ దక్షణ మంద త్రొక్కుపరి యం దుచ్చైర్నినాదంబులన్ ౭

కం॥ చొచ్చి కవాటై యటునిటు విచ్చలవిడిఁ బరువులిడుచు విప్రుల నెల్లన్
జెచ్చెరఁ బొట్టం బెట్టిరి యచ్చటి హవిరాదికముల హరియించికొనిన్, ౮

క॥ ఆయ్యెడల నొక్కపెట్టునఁ గుయ్యొ మొఱ్ఱో యటన్న ఘోరనినాదం
బయ్యజ్ఞవాటి నగుటయుఁ జయ్యన దీక్షం ద్యజించి సౌదాసుఁడు తాన్ ౯

ఆ॥ బాణ మెక్కుపెట్టి భటునిచే నీఁబడ్డ విల్లుఁగొని సివంగిపిల్లవోలె
వకురమూఁక పైకి నట్టె విలంఘించి చంపె వరుసఁ బెట్టి చాలమంది, ౧౦

పృథ్వీ॥ వశిష్ఠముని వల్లనా వలసినంత రక్షావిధిన్
నిశాచరవరూధినిన్ నిరవశేషముం జేయుచున్
సుశీలుఁడగు నమ్మహీశుఁడు వధించెఁ గ్రూరాక్షుఁ డా,
నశక్య మెది మానిరా డవనమున్న భూజానికిన్. ౧౧

ఆ॥ క్రూరబుద్ధిఁ గూడఁ గ్రోధతామ్రాక్షుఁడై భిన్నదేహుఁ జేయు భీతి నతఁడు
బ్రహ్మతేజుఁడైన పతి నెదుర్కొనలేక పాఱె మిగిలియున్న బలముఁ గూడి, ౧౨

కం॥ పదపడి యదియె విరోధము మదినిడుకొని రాక్షసుండు మహ్యాధిపునిన్
దుదముట్టించుటకుం దగు నద నరయుచు చహర్నిశంబు నలజడి గుడువన్

చ॥ దొరక దొకింతయేనియును దోషము వానికి, నవ్వసిష్ఠు స
త్కరుణ నిరంతరాయముగ ద్వాదశవార్షికమైనసత్త్ర మా
నరపతి పూర్తిచేసి యభినందితుఁడౌచును బ్రాహ్మణాళి స
త్వరముగఁ బంచెఁ దత్తమఖదక్షిణపూర్వము గాఁగ నిండ్లకున్, ౧౪

వ॥ అట్లుపంచి వసిష్ఠుదిక్కు మొగంబై దోసిలొగ్గి ౧౫

కం॥ “నా చేతిమీఁదుగా నీ కాచరితంబగును నేఁటి యాతిథ్యం బో
యాచార్య! కరుణ నిచ్చట బోఁచేసి యనంతరమునఁ బొమ్మెటకేనిన్,” ౧౬

చ॥ అనవిని యమ్మునీశ్వరుఁడు “నట్టులె యౌత” మటంచు నుండుడున్

జనపతియాజ్ఞఁ బాచకులు చయ్యనఁ బాక ముపక్రమించి, తా
యనువు నెటో గ్రహించి నికషాత్మజవర్యుఁడు క్రూరబుద్ధి య
ల్లనఁ జనుదెంచె నచ్చటి కిలావిభు ప్రాఁబగ దీర్చికొంటకున్, ౧౭

క॥ చనుదెంచి మునినిమిత్తంబని శ్రద్ధను బచ్యమానమగు మాంసపుఁ గుం
డను లేపెఁ దత్సమంబగు మనుజామిషఘటము నునిచి మఱియొక డచటన్,

తే॥ అంత మధ్యాహ్నమగుటయు నవనివిభుఁడు సంయమిశ్రేష్ఠు పదవనజములు గడిగి
యథావిధి భోజనముపెట్ట నతఁడు తినియె వండివడ్డించు నవ్వాని వలసినన్ని, ౧౮

క॥ తినినపదార్థంబులలో మనుజామిషముండుటెఱిఁగి మనమున నుదయిం
చిన కనలు నణఁచుకోనలే కనియెను జననాథుఁగూర్చి యమ్ముని యిటులన్,

క॥ "నరమాంసము తినిపించితి నరపాల! నరాదుఁడటుల నాచేతను నీ
పరువెల్లఁ దెలిసిపోయెను, జరియించు నరాదుఁడగుచు క్ష్మాస్థలి నింకన్"

చ॥ అని శపియింపఁగాఁబడి యిలాధిపుఁ డమ్మనుజామిషంబు రా
క్షసుఁ గరుగోఁగ నొక్కఁ కనిగాఁగను బిల్వఁగఁబంచి వంటవా
రిని నడుగంగ వారలును జేనికమ్రొక్కి యిటుల్వచించి "శో
భనగుణ! మేము వండినది కాదిది యెన్నివిధాలఁ జూచినన్,

ఉ॥ కాదు మఱొక్కమానవుని కార్యముగూడఁ దలంపనిద్ధిమ
ర్యాదుని చెయ్యి గావలయు నయ్యది గాఁటులైన దయ్యపుం
జైదము నేనికావలయు, సత్యము నారసి మున్నపంతరం
బేది సమగ్రమైన నది యూహొనరింపు ధరాపురందరా!"

చ॥ అనియిటు పల్కుచుండఁగనె యంబరమార్గమునుండి సంయము
గాళనమునవచ్చి యయ్యది నిశాచరకృత్యమయాటఁ దెల్పుడున్
జనపతి యవ్వసిష్టుఁ బ్రతిశాపవిఘాతమహత్త్వఁ జేయఁగన్
దనదు కరాంజలిం గొనియెఁ దక్షణ మచ్ఛజలంబు శ్రద్ధతన్,

క॥ శాపోద్యతు సౌదాసమహీపతిఁ బొడఁగాంచి యంత నెంతయుఁ గలహో
ద్దీపకుఁడయ్యును ధర్మస్థాపనమతి నారదుండు తగ నిట్లనియెన్,

క॥ "కొట్టినను దిట్టినను బగపట్టినను దురాగ్రహమున బ్రాహ్మణు నెడ[illegible]
జెట్టదలంపక దండము వెట్టఁగవలె క్షేమకామి పృథివీస్థలిలోన్,

కం॥ గురు విరఁడు శిష్యమతియుం బరిపూజ్యుం డట్లుగాకఁ బ్రతిశాపముచేఁ
బరిభూతుఁ జేఁతవగ్నమ్ము మరలుచుకొను మింక నీదుమతి క్షితినాథా!"

కం॥ అనియిట్లు నిషేధించుడు దినవాథపవిత్రజననదీపకుఁడగు త
జ్జననాథుం డుదకాంజలి తనదుపదాబ్జముల నేకధారగ విడిచెన్,

కం॥ తత్తప్తశాపజలములు మొత్తముగం బడినమాత్రమున నా భూపా
లోత్తము పాదాబ్జము లవి కత్తి కదుగాల్మషయ్యె నేమందు నికన్,

ఆ॥ ఆవిధంబుగాఁగ నాతండు కల్మాషపాదుఁడగుటఁ జేసి పాలులార!
బల్కెమెఁ దదాది కల్మాషపాదుఁడన్ పేరఁగూడఁ దలఁచు పిల్వఁబడిరి, ౨౬

ఆ॥ సత్యమరయ కట్లు శాపమిచ్చుటకుఁగా సిగ్గుపడుచు నవ్వసిష్ఠుఁ డపుడు
ధరణిపాలుతోడఁ గరము బశ్చాత్తాపమువను నిట్టులనిరి మునివరుండు, ౨౭

కం॥ "వ్యర్థము గాశపియించి యనర్థము బొల్పసినాఁడ నక్కట! నిను నో
పార్థివ! యెప్పటికిని నయథార్థముగా దస్మదుక్తి, యూహింపుమన్ ౨౮

ఉ॥ ఉండుము కొంతకాలమిటు లుగ్రనరాదుఁడవై ధరిత్రి, నె
న్నం డిల క్రూరబుద్ధి మరణంబును గాంచును యుద్ధమందు నీ
నుండియు యన్న డొందెదు నృపోత్తమ! నీవగు లోంటిరూపమున్
వెండియు" నంచు నిట్లు కరుణించి వసిష్ఠుఁడు పల్కుచుండఁగన్ ౨౯

ఆ॥ ఊర్ధ్వకేశుఁడుగను, నత్తుంగతనుఁడుగా నతిభయంకరుఁడుగ నయ్యె నార!
చిటికవేయునంత సేపటిలో నేఁడు పాఱలంత పాచిపండ్లుగలిగి, ౩౦

ఆ॥ అట్టు లఖిలతనువు నాసురము గుటయు జన్తులను బెలిచి చంపె ద్విజాల,
నసురభావ మూనునట్టికే యిట్టుగా నసురదేహధారు లగుట యరుద, ౩౧

కం॥ మునిపల్లె లన్నియును గొనకొని తగులంబెట్టు చటులఁ గుత్సితబుద్ధిన్
జననాయకుండు రక్తస్తనుఁడై వనభూములందుఁ జరియించుటయున్ ౩౨

చం॥ వినియొకకొన్ని నాళ్ళకు వెన్కటి వైరము సంస్మరించి దు
ర్మనుఁడగు క్రూరబుద్ధి పలుమంది సురాయులతోడఁ గూడి యా
ఘనుఁడు నిరాయుధుండై యుకానొక నాఁడ వసించు పట్టునన్
జనియెఁ దదంతికంబునకుఁ జయ్యన నొక్కనిఁ జేసి చంపఁగన్, ౩౩

కం॥ చని రక్కసిగుంపులతోడను నాతని జుట్టుకొని హాళాత్తుగ దెసలన్
నినదముచేఁ బూరింపుచు నొనరించుచు నట్టహాస మొగి నిట్లనియెన్, ౩౪

పంచచామరము. "వశిష్ఠునందనుం జేరియున్నవాఁడవై మదగ్రజున్
నిశాచరేంద్రు బల్మిఁ బట్టి నేలఁ గూల్చియుంటి నుగ్రుఁ,
నృశంస! దాని కర్మఫలము నేఁడు ప్రాప్తమయ్యె, నీ
యశక్తమగ్నవత్స్వమెల్ల వ్యర్థమయ్యె నెట్టికన్"

చ॥ అనవిని "శారదాభ్రరవమట్టులు నిష్ఫలమైనమాట లే
లనియెదు, నోటఁ బల్కు నది యాచరణంబునఁ జూపువారి దు
ర్జనన!" అటంచు నొక్క పెనుశాఖి సమూలముగాఁగఁ బీకి యా
దనుజునిపైకి నెట్టురికెఁ దర్పితనీరదగర్జనంబునన్, ౩౬

క॥ వానికడను గొండొకమ్రాఁకును దోడన పెకలించి నృపతితో డీకొనఁగన్
గ్రీడమయి యెదుర నడచెను వాఁడైన యుపర్ణమాత్ర బాధింపంగన్, ౩౭

క॥ ఈవిధముగ నతిబలులౌ నావీరులు కసిమసంగి యత్యంతరమున్
గావించిరి బహువృక్షులయావహమగు ఘోరయుద్ధ మవ్వనభూమిన్, ౩౮

ఆ॥ అంతఁ గొంతనడికి క్రాఁతుడుకా వాఁడు రెండుకాళ్ళు బట్టి రేఁడు వేగఁ
ద్రిప్పి గిరగిరం బృథివిమీఁదఁ బడవైచెఁ గరము పిండిపిండిగాఁగ నొడలు, ౩౯

క॥ శూరుండగు తద్రాక్షసవీరుఁడు మరణంబుఁ జెందు వెంటనె దనుజా
కారమునువీడి మహిపతి చారునిజాకారమెనసె శాపచ్యుతుఁడై, ౪౦

తే॥ అంత మిగిలిన రక్కసులందఱుం దదవనినాయకుచుట్టును గవిసి రయము
వృక్షపాషాణమయమగు వృష్టిఁ గురియ వృక్షహస్తుండయగుచు నవ్వీరవరుఁడు

క॥ యమనగరికనిపె వారలఁ దమనగరికిఁ జానుబోయెఁ దద్వరితమ కానీ
సముపేతబ్రహ్మహత్యత నృపుహస్సుమగోలుపోయి తన్మతి కడకున్, ౪౧

క॥ ఒడలున నెలకొనియుండి పెనువాసన మొదలుగాఁగఁ జిహ్నము లెల్లన్
బొడఁగాంచి యతని పెద్దగడలుఁ గొడుకులు నవ్వారి యనుఁగుగొడుకులుఁగూడన్

ఆ॥ దూరదూరమునకుఁ బాఱినవారలై యిట్టులనిరి యమ్మహీశుఁ గూర్చి
"శాంతకత్వయమ్ముఁ ద్వత్తనువ్వుపై నలఘుశలుమ మొలయఁగలదు మాకు,

ఆ॥ బ్రహ్మహత్యపట్టి బాధించెడిని నిన్నుఁ గాన నవ్వసిష్ఠవరునిఁ బిలిచి
జరుపుకొనుము రాజ! సరవిఁ బ్రాయశ్చిత్త, మందువలన శుద్ధినందఁగలవు,,

చం॥ అనుటయు నమ్మహీరమణుఁ డమ్మునిఁ బిల్చి విదూరగుండయి
వినయముతోడ నిట్టులను "విప్ర మహాత్మ త్వదీయసత్కృపన్

ఉ॥ ఏసమయంబునందున మహీసురశాపమునన్ స్వకీయతా
భ్రాసుతపూర్వశాకృతికి భంగమువాటిలి సిగ్గుగూర్చెనో
యాసమయంబునందున నిజాంగనదౌ నెడఁబాటునుండియా
యాసముఁ జెందు చంద్రధరుఁ డంగము సంగతి బొందెఁ బ్రేమునన్ ౫౬
ఆ॥ భ్రూణరూపమునను బోయుచుండు టట్టు గాఁగ గర్తమెయ్యఁబడియెఁ గాన నద్ది
సర్వపాపహరము క్ష్మాపాల! యద్దియే కతముగాఁగ భ్రూణగర్తమయ్యె ౫౭
చం॥ అనియిటు లభవీశ్వరి నవాటయు సంతసమంది యేఁకు నీ
యనగరిఁ జేరఁగాఁ దిగె, నకాత్యసుముఖ్య ద్విషాంపతిద్యుతిన్
గనుగొని హర్షబాష్పములఁ గాల్చుచు మెఱిక్రిద్విపుతుఱులుం బ్రిజల్,
మునివరుఁడౌ వసిష్ఠుఁడును మోదమునం జనుదెంచి యిట్లనెన్, ౫౮
ఉత్సాహము. భాగ్యగరిమఁ జేసినీదు బ్రహ్మహత్య వసె, యథా
యోగ్యమైన కాంతిగల్గి యొడలు దీప్తమయ్యె, నై
రాగ్యమూని నీవు చన్నరాజ్య మెద్ది! యిచ్చటన్
బ్రాగ్యతౌఘమెల్ల విన్నఁ బాయఁగలిగెఁ జెప్పుమా, ౬౦
చం॥ అనుటయు భ్రూణగర్తపు టుదంతము సాంతము స్వానుభూతమౌ
ననువునఁ జెప్పి వృద్ధులయినట్టి యమాత్యులతోడ యోజనం
బొనరిచి యమ్మహాముని యుయుక్తమునంగఁ బ్రోద్ధనామ్హాయుతా
దనతనుజాతు రాజ్యమున స్థాపనఁ జేసెను దక్షిణంబునన్, ౬౧
తే॥ అట్లుస్థాపనచేసి యయ్యవనివిభుఁడు పూర్వమంత్రులతోడ నాభ్రూణగర్త
మునకుఁ జని భ్రూణహాపాపమూర్తిఁ దలఁచి తపముచేసి ముగితిగాంచెఁ ద్వరితముగను,
ఆ॥ నాటఁగోలె నద్ది వరలోకమందున భ్రూణగర్తమనఁగఁ బొగడఁబడుచు
స్నానదానముఖ్య సత్కర్మకృజ్జన కల్మషములఁ జెండఁగలిగి యుండె, ౬౩
కం॥ అటఁ గృష్ణచతుర్దశి నాదట శ్రాద్ధము పెట్టునెడలఁ దద్దినమున నే
యిటుపదితరముల పితరుల కటుపదితరముల పెతాళ్ల కబ్బును సుగతుల్, ౬౪

——♦ నలనిర్మిత చర్మముండా మాహాత్మ్యము. ♦——

ఆ॥ చర్మముండ నలుఁడు స్థాపించెనప్పుట, నష్టహేశ్వరిని మహానవమిని
భక్తిఁ బూజసేయు ప్రజ కభీష్టముల్ శాశ్వతంపుఁబదవి సంఘటిలెడి, ౫౬

చందిరికా ప్రెస్, గుంటూరు

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.

3 రాజా వెల్లపురవల వెంకటరాఘవేంద్రరావు బహద్దూర్,
జాగీరుదారుగారు, నవాబుపేట.

3 బాకరాజా పరాంకుశరావు దేశముఖుగారు, యాడవరం

---

ఈ నెల సొమ్ము చెల్లించిన చందాదారులు

౧ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహదరు,
జమీందారుగారు, ఎలూరు.

౨ చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు, గుడివాడ.

3 శంకరమంచి అన్నయ్యశాస్త్రిగారు, చినవోగిరాల.

౪ లంకా అంబయ్యశాస్త్రిగారు, అంబాపురము.

---

ప్రకటన.

దుందుభినామ సం॥ర శ్రావణమాసారంభమునుండి ప్రకటింపబడును.

# ఆయుర్వేద పత్రికాశిక

(అనేక వైద్య మాసపత్రిక)

సంపాదకుడు— బులుసు దుర్గాప్రసాదరావు.

ఇప్పత్రిక కేవలము వైద్యులకేకాక ఆరోగ్యమును గోరువారికందరకును మిక్కిలి ఉపకారి. ఇందు సుప్రసిద్ధప్రాచీనాధునికాయుర్వేద గ్రంథములకు భాషాంతరీకరణములు, విమర్శనములు, పరిశోధనలు, సందిగ్ధములుగానున్న వివిధవిషయముల నిజానిజములు, ఆరోగ్యసూత్రములు, ఔషధకల్పనలు గృహవైద్యము, నిదానము, శారీరశాస్త్రవిషయము, మొదలగు వైద్యసంబంధములగు సర్వవిషయము లిందు ప్రకటింపబడును. వేయేల? ఈపత్రికలం జదువుచుండిన నెల్లరకును త్వరలో నాయుర్వేదమున మంచి పరిచయము కలుగుననుట కేమాత్రమును సందేహము లేదు. చందా సం॥ రూ 3.

ఆయుర్వేద పత్రికాశికా కార్యస్థానము, గుంటూరు.

V. B.— చరకసంహిత చికిత్సాస్థానము మాసమునకు సుమారు ఒకయధ్యాయము చొప్పున ఆంధ్రతాత్పర్యసహితముగా ప్రతిసంచికయందును ప్రకటింపబడును.

